ఆ. అనుచుఁ దన తపమునకును విఘ్నమూర్తియౌ
కొమరుఁ గాంచి ముద్దుగొనెనొ లేదొ
మాయగప్పినట్లు మమతరాఁ బోతన
కరఁగిపోయె మనసు తిరిగిపోయె. 288

క. కనులకుఁ గౌముది ముద్దులఁ దనుపు సుధానిధి పటీరతనులేపమునై
తన పంచప్రాణమ్ములఁ గనకపుపేటి యగు తనయుఁ గన్గొనుచుండన్. 289

క. దినములు క్షణములుగా హా
యనములు దినములుగఁ దెలియనట్టులు సుఖజీ
వన మొక మధురస్వప్న
మ్మనఁ జనఁగాఁదొడఁగెఁ బోతనార్యున కంతన్. 290

ఆ. తపముమాట తిరిగి తలయెత్తనేలేక మాటుమడఁగె వెడలుమాట లుడిగెఁ
బాలకునకు మరగి పంజరబంధమ్మె సుఖమటంచు నెంచు శుకము భాతి. 291

ఉ. ఈఁత నెఱుంగువాఁడు మఱి యీఁత నెఱుంగనియాతఁ డిర్వురున్
నూతను దూఁకినంతనె మునుంగుట లెన్న సమానమయ్యు నా
యీఁత నెఱుంగు మానిసి యొకించుకలోనె మునింగి తేలఁడో!
పోతన సంసృతిన్ మెలఁగు పోకడ లట్టివె కావొ యారయన్. 292

చ. హరిపద కంజపంజర విహాయసతన్ విహరించు మత్తబం
భరమనఁ బోతనార్యు నెద బ్రహ్మవిచార కథాసుధా సరో
వర లహరీవితానగతి వర్తిలు రాజమరాళబాల యై
పరహితచింతనొందు భవపంకము నంటకయుండు నిత్యమున్. 293

క. కవియై పుట్టిన పోతన వివిధ విషయగతుల కైత వెదకుచుఁ బోవున్
భువిఁ దిరుగులాడు గౌతమి సువిదితగతి జలధిజాడఁ జూచుకొను గతిన్. 294

సీ. ఋతుసంగతుల మహోన్నతశోభలం దేలు ప్రకృతి సౌందర్య సంపదలఁ గ్రోలు
శశి సూర్యబింబ ప్రశస్త ప్రభాదీప్త విశ్వాకృతులఁ గాంచి వినుతి సేయుఁ
గమనీయ మృగపక్షి గణ రూప రేఖావిలాస లాస్యములఁ బేరాసఁ గాంచు
సుఖదుఃఖ సంగతిన్ జూపట్టు నరజాతి మానస పరిణామ మార్గమరయు.
తే. నవరసప్రకాశక భావనామ రూపకలితమగు నీ జగత్కావ్య కవి యెవండొ
వాని మదిని దలంచి యవ్యాజ భక్తిభావ పారవశ్యమ్మునఁ బ్రస్తుతించు. 295

సీ. పొలము కావలికని పోవునే గానియా పొలముపనుల బుద్ధి నిలువ దెందుఁ
బలుమాఱు పనివారు పిలిచినన్ వినరాదు వినవచ్చినన్ బల్క మనసురాదు
పల్కినన్ వారలు ప్రశ్నించునదొకండు తానేదొ వేఱె యుత్తరమొసంగు
నిదియేమి యిటులేల బదులిచ్చెదరటన్న నేమంటినో నేనె యెఱుఁగనను

తే. ఏదొ స్మృతిపథమ్మున స్ఫురియించినట్లు
భావనమొనర్చుఁ గదలని ప్రతిమభంగి
వెదకుచున్నట్టి ధనము లభించె నిపుడె
యనఁగఁ దనలోనఁ దానవ్వుకొనుచు మురియు. 296

ఆ. రేయుఁ బవలు నురక వ్రాయు చింతయె కాని యన్న పాన వేళలైనఁ గనఁడు
భోజన మ్మొనర్పఁ బొత్తులో దినవచ్చు చీలినైన పొమ్మిసీ! యనండు. 297

సీ. చెరువు మానస సరోవరముతోఁ గవగూడి
నవరసపూర్ణయై నాట్యమాడ
క్షేత్రమ్ములున్ దాళపత్రమ్ములం గూడి
శ్రీసంపదలతోడఁ జెంగలింప
నాఁగేటికఱ్ఱు గంటపుమొనన్ జతగూడి
క్షోణి మేలిమి వర్ణశోభ లీన
సస్యముల్ స్వకవితోద్దేశ్యమ్ములంగూడి
బహుఫలప్రదములై రహిఁ జెలంగ

తే. గోగణము వృత్తగణములం గూడి కృషిని
వాగ్విపాదముల్ ధర్మము న్నడుపుచుండ
సేద్యమునఁ బద్యమున జడచేతనములఁ
బెంచసాగెను బోతన్న ప్రియనయముల. 298

క. వర కవితోపాసన మిహపర సాధకమంచు నాత్మ భావించి మహే
శ్వర లీలా విలసనముల సరస మనో హరసుమధురశైలిన్ గూర్చున్. 299

శా. తానా పోతన కొన్ని వత్సరము లేతద్రీతి సత్కావ్య ని
ర్మాణాఖ్యానము శాస్త్రసంగ్రహము గీర్వాణాంధ్ర సాహిత్య వి
జ్ఞానోపార్జనమున్ బొనర్పఁ గవితా సామ్రాజ్య ధౌరేయుఁ డా
శ్రీనాథుం డొకనాఁడు వారిఁ గనవచ్చెన్ దుఃఖ దైన్యాహతిన్. 300

ఉ. వచ్చిన శ్యాలకుం గనుచు వందనమున్ బొనరించి పోతరా
జెచ్చటి నుండి రాక యనఁ దేమియుఁ బల్కఁడు చిన్నవోవు మో
మచ్చుపడంగ లోనరిగి యాలినిఁ గాంచి విషాదమొప్ప వా
క్రుచ్చెను బావ వచ్చెనని కోమలి వేవెలి కేఁగుదెంచుచున్. 301

చ. తటుకున నన్నుఁ గాంచి కనుదమ్ముల గిఱ్ఱున నిండు నశ్రువుల్
జొటజొట గ్రచ్చుకాయలటు చుక్కలు రాల్చఁగ నోష్ఠనాసికా
పుటములు సంచలింపఁ బొరివోవుచు గద్గదకంఠ మెత్తి దు
ష్పుటమును మోమునం దిడి గుభాలునఁ బైఁబడి యేడ్చె నెంతయున్. 302

చ. వలవల కంటినీర్వడిపి వందురుచున్న యవీయసిన్ గనన్
గలికలియయ్యె గుండె వెతకంఠము మట్టుకు దట్టిపట్టె నా
చెలియలి బాష్పవాహినులఁ జేడ్పడి యాతని దుఃఖవారిధుల్
జెలియలికట్ట దాఁటి తడజిమ్మెను జెక్కుల దూఁకు నశ్రులై. 303

ఆ. జ్ఞానవంతుఁడైన కవినాథు శ్రీనాథు నాక్రమించి దుఃఖ మజ్జుఁ జేసెఁ
దాళపత్రమందుఁ దనరు నక్షరమును క్షురమొనర్చు చెదలపురువు భంగి. 304

ఉ. హెచ్చిన దుఃఖవహ్ని దహియించుట నిర్వురి యాత్మలచ్చటన్
వచ్చిన లోకులెల్లరు నవార్యగతిన్ మనసుల్ కరంగి క్రొ
వ్వెచ్చని బాష్పధారలయి వేగతులన్ బ్రవహింప నీగతిన్
గ్రచ్చర మాటలాడెదరు గ్రమ్మెడి యశ్రులు గోటమీటుచున్. 305

ఉ. ఆలు గతింప దిక్కఱిన యాత్మజనుం గొని చెల్లెలమ్మ హ
స్తాల నిడెన్ విషాదకర సంఘటనల్ కనతే మదేమియో
జాలి జనించు నీ నిసుఁగు చక్కని మోమును గాంచఁ దల్లి చ
న్నాలను ద్రావనోఁచ దఁట వత్సరమైన నభాగ్య యింతకున్. 306

తే. వదినె చనిపోయెనని వార్త వచ్చినపుడు
పురిటిలోని బాలెంత యూపొలఁతి తాను
అందులకె యప్పు డగ్రజు మందలించి
పిలుచుకొనిరాఁగ నత్తమామలను బనిచె. 307

క. వారేఁగి మాసమయ్యెను జేరిరి నేఁడిరటి కేమి చెప్పఁగవలె నీ!
దూరపు బంధుత్వపు వ్యవహారము సంకటపువేళ [illegible] 308

క. కన విన దుర్భర మింకను
మనసున్ మర్మముఁ జెకల్చు మగువవిలాప
మ్మనుచున్ బంధువితతి యా
వనితను సాంత్వన ప్రశాంత వాక్కులఁ దేల్చెన్. 309

ఆ. ఉబికివచ్చు దుఃఖ మొకయింతఁ గన్నీరు
గార్చి యేడ్వ శాంతి గూర్చెఁ గొంత
కలఁగి రొదయొనర్చు కాదంబినులు వాన
గురియు వెన్క స్థిరత గూడునట్లు. 310

క. అప్పుడు శ్రీనాథుఁడు కడు దెప్పరమగు వగలఁ బొగిలి తేఁకువసెడుటన్
జొప్పడిన లొజ్జదనమున్ దప్పుకొనన్ లేక కంటతడి నిడి పలికెన్. 311

క. 'కడుపు ఫలించిన దనుకొని కడు వేడుకపడితిఁ గాని కడ కీగతిఁదా
విడిపోవు నన్నటంచును నడికడలిన్ బుట్టిముంచు నాకని తెలియన్. 312

క. ఇంటిపనులె చూచెదనా చంటినిసుఁగు నూరడించి సవరించెదనా ?
యొంటరికాఁపుర మీఁదఁగ గంట న్నీరొదవుఁ కాలకంఠునకైనన్. 313

క. రొమ్మునకుఁ గట్టుకొని యీ యమ్మాయిని సాకినాఁడ నధి యెందును మా
యమ్మేది యనినఁ గడుపది చుమ్మలువో నెడఁద ముంచు శోకాబ్ధియలల్.

తే. తోడిపిల్లలు మాయమ్మతోడఁ జెప్పి
పప్పు లడుగుకొందు మటంచు బయలుదేఱ
దాను మాయమ్మ నడిగెద నేనఁటంచు
జేరి 'నాయనా! యమ్మేది చెప్పు?' మనును. 315

క. తాఁ జనియె మీఁదిలోకము జేజెకడకుఁ బూజసేయఁ జిటితల్లి! యనన్
వేఁ జమదు నచటికే యను నేజాడని పోదు దుఃఖ మెటు లాగు నిఁకన్. 316

ఉ. చిత్తము తల్లినుండి యెటొ చేసి మరల్త మటంచుఁ జేతఁ బం
డ్లిత్తు సనేమిరా విన దొకేచదు వూరక వేఁగతే నెదో
చిత్తరు విత్తు నమ్మదనిచెప్పి పదేపది, పిల్చునమ్మ యం
చత్తటి దాని నాకపుడొ యశ్రుజలాంబుధిఁ గ్రుంకు లోకముల్. 317

తే. 'అమ్మ'! యనుచును [illegible] కమ్మగాను
బిలువ నమృతమ్ము [illegible]

దీనికిని మించి స్వర్గమ్ములోన నేమి
జుట్టుకొన నేఁగినావు నా సుదతి నీవు. 318

క. అనుచుఁ దరుముకొనివచ్చు వెతను నేమాత్రమ్ము నాఁపుదమన వివశచే
తన దలవంచి వగతు నన్గని నా తలయెత్తి కాంచుఁగందువు తానో. 319

ఉ. కన్నులనీరు కన్నులనె కన్పడకుండఁగ గ్రుక్కుకొందు నే
మన్నను నేను నా తనయ హా! యని బెంగఁగొనున్ నితాంత మీ
చిన్నికుమారితం గనుచు జీవనముల్ మెయినిల్పుకొందు నే
మున్నది నాకు నీ భువి యయోమయమై కనిపించు నెల్లెడన్ 320

తే. ఆననోత్పల సుమనోజ్ఞహాసకళల
వెలుఁగు నా చంద్రదీపమ్మె మలిగిపోయెఁ
దక్కిన విలాససంపదల్ చుక్కలన్ని
యెన్ని యున్నను విశ్వమ్ము సున్నగాదె? 321

క. మగువల వెతవలెఁ బొంగక మగవారల వ్యథలు లోనె మసలును గాఢా
ధిగతాగ్ని పొగల మంటల నగపడు నగపడునె తప్తమగు లోహమునన్. 322

క. ఇది కన్గొని లక్కాంబయు
మది మైనమ్మగుచుఁ గరఁగి 'మాన్యవరా! యీ
సొద యేల? నేఁ గలుగ శా
రదమాతృవిహీన యన ధరన్ మృష' యనియెన్. 323

తే. అవని సహృదయుల్ నిష్కల్మషాంతరంగు
లొరులసుఖదుఃఖరూపము లరసినంత
యద్దములయట్లు ప్రతిరూపమై నటింతురి
కొండగుహలై ప్రతిధ్వనుల్ కూర్చుచుందురి. 324

క. పోతన శ్రీనాథుని వలపోఁత నుడుపఁగా విరాగపూర్ణ వచస్సం
ఘాత సుబోధ సమాహిత చేతనునిన్ జేయ నిటు వచించును దాల్మిన్. 325

శా. 'బావా! నీవ సమస్తశాస్త్రచయ సంపన్నుండ వస్మాదృశా
త్మావిర్భూత మహాజ్ఞతన్ దొలఁగఁజేయం జెల్లు నజ్ఞుంబలెన్
నీవే యిట్టు లపారశోకజలధిన్ నిర్వేదమున్ జెంద నిం
కే వైరాగ్యపరుండు రాఁగలఁడు నీ హృద్వేదనన్ మాన్పఁగన్. 326

తే. ఆయు వరిగినకొలఁది తా ననవరతముఁ
జనఁదొడఁగెఁ గాలసామీప్యమునకె ప్రాణి
ఇది విషాదాంతనాటక మిందుఁ జివర
మంగళముఁ బాడఁగల్గు సమర్థుఁ డెవఁడు ? 327

శా. నానా చిత్రవిచిత్రి వర్ణగత సౌందర్యంబు లెల్లన్ లయం
బూనున్ నీడను నేత్రహాసముఖహస్తోరుప్రదేశాల వి
న్నాణంబు ల్గనరావు భూశయనమున్ దా నొంద రూపప్రితుల్
మేనన్ నీడవలెన్ జనించు నరుతో మృత్యుస్వరూపం బనన్. 328

క. ఇరులడఁచు రవికరాళిన్ జిఱునీడపట మ్మొకింత చెడునె సవిత ముం
దరుదేర వెన్నడఁగు వెన్బరతెంచిన విడక ముందు వచ్చు మెలఁకువన్. 329

తే. బాలవృద్ధార్కులం గని చాల పొడవు
పెరుఁగు మధ్యాహ్నరవిఁ గని తఱిఁగి కాళ్ళు
బట్టుకొని మఱుంగగు నీడ బ్రహ్మచర్య
యుత యువకుచెంత నడఁగి యిట్లుండు మృతియు. 330

శా. సాయంకాలము వర్షకాలముగతిన్ సంవర్ధకంబై మనన్
ఛాయావాహిని నై జవేగమునఁ బ్రోత్సాహమ్ము దీపింపఁగన్
స్వీయావాసముగాఁ జెలంగుతి మిరాబ్ధిం జేరఁగాఁబోవు నీ
కాయంజాండపరిదోష సంతమసముల్గావే జరామృత్యువుల్. 331

తే. పాంచభౌతిక సోదరభావగతిని జల్లఁగా దేహరథమెట్లొ సాఁగుగాని
పొలివగ నవి కచ్చుకుఁ గాలుద్రివ్వి కుపితగతి వేఱుఁబడఁ గొంప గూలిపోవు.

తే. జలము వహ్నికి నాజన్మశత్రువుగదె !
యగ్ని జలము నావిరిసేయ నరయుచుండు
వాయువో యవ్యవస్థితవర్తి ధరణి
వీరి స్థిరమైత్రి నెవ్వఁడు విశ్వసించు 333

సీ. కారుచీఁకట్లలోఁ గమ్మనిమూపిన వెల్గు
తెలియునే తానొక్క తేజమనుచుఁ
జిఱుబీజమందు నిద్దురజెందు వృతమ్ము
నవ్వునే పువ్వుచిహ్నాలితోట

నావిరియై వాయువం దాడు నీరమ్ము
నడచునే తానొక్క నది ననుకొని
సూక్ష్మశుక్లకణాల సుప్తిఁ జెందెడి మేను
తన నిజరూపమున్ గనఁగలుగునె

తే. తను నితరమును గుర్తింపఁ దరముగాని
స్థితి దనరుఁ బరిణతుల సృష్టియు లయమ్ము
బిందువుగఁ బ్రవాహముగ నావిరిగ మాఱు
జీవనమె సృష్టిలయయుత జీవనమ్ము. 334

తే. కనులు మూసినఁ గడలేని గమన మనును
గనులు తెఱచిన నిచటనే కల ననుకొను
మహిని గానుఁగెద్దు పథగమనమువోలెఁ
గాలచక్రయాత్ర కొకప్డు కడయెలేదు. 335

ఉ. పూర్ణమునుండి పెక్కు లిలఁ బూర్ణము లుద్భవమంది మాయు నా
పూర్ణము తాను లోపమును బొందక యెప్పుడు నిల్చునెట్లనన్
పూర్ణిమచంద్రబింబములు పూర్ణతటాక ఘటాదులందు సం
కీర్ణత నొంది జీవనము కీడ్పడఁ బూర్ణశశిన్ సమైక్యమౌ. 336

క. సవరించు నీ భగిని రెండవ ప్రాణమ్మట్లు నీదు నందన నేనున్
భవదీయ స్వస్రీయగ నవలోకించెద నిఁకేల నడలెదు బావా!' 337

తే. అనుచు భార్యావియోగజన్యార్తితోడ
నదరిపోయిన శ్రీనాథు హృదయమునకు
సరస శీతానునయవాక్య చందనముల
నలఁదె దుఃఖాగ్ని సంతాప మపనయించె. 338

## ఆ శ్వా సాం త ము

క. ఇనవంశాభరణా! మునివనితా ప్రారబ్ధపంక వారణచణ మృత్
కణ విలసదబ్జచరణా! పినాకమదహారణ! విశ్వవినుత వితరణా! 339

శా. ఆకర్ణాంత జగన్మనోహర విశాలాబ్జాక్ష! సౌందర్యసా
రాకీర్ణాబ్ధితరంగరంగముఖ లాస్యస్మేన దృగ్వీక్ష! ల

క్ష్మాకాంతాకృత సింహపీఠ విపుల శ్రీవత్సవక్షా ! సురా
నీకాధ్యక్షు ! దశాననద్విపశిరోనిర్లూనహర్యక్షమా ! 340

### తోటకవృత్తము

దశకంఠ విదారణ దాశరథీ దశకాయ వితారణ ధర్మసుధీ !
దశరూప ధరాంశజ తత్వనిధీ ! అశుభాంతక పూర్ణదయాజలధీ ; 341

### గద్యము

శ్రీమద్భరద్వాజగోత్ర పవిత్రాపస్తంబసూత్ర, ప్రథిత సూరిజనమిత్ర,
బక్కయ్యశాస్త్రిపుత్ర వాగీశ్వరీ సమాసాదిత, వైదేహీవర నివేదిత
సరసకవితావిలాస, సహజ పాండిత్యభాస, వరకవివిధేయ,
వరదార్య నామధేయ ప్రణీతంబైన పోతన చరిత్ర
మను మహాప్రబంధమ్మునందు
తృతీయాశ్వాసము.

శ్రీ ర స్తు

శ్రీ వాగీశ్వర్యై నమః




## రాజ సందర్శనము — భోగినీ దండక రచనము

"స్త్రీరత్నం దుష్కులాదపి"

శ్రీ విలస త్పంచవటీ
పావనవన భాసమాన పర్ణ కృతకుటీ
రావాస ! ఛద్మహారిణ
ప్రావీణ్య నిరాసదివ్యబాణ విలాసా ! 1

గీ. ఆంధ్రవాణీ మనోజ్ఞ నాట్యాభినయము
తేనెలూరు సత్కవితా ప్రసూనచయము
స్వామి యవధారు పోతన సచ్చరితము
జానకీజాని పృథ్వీశ చక్రపాణి ! 2

వ. అంత శ్రీనాథకవిసార్వభౌముఁడు 3

చ. తన వెత డింద బంధ్వవసథమ్మునఁ గొన్నిదినాలు మానస
మ్మును గుదుటన్ బడన్వయిచి పోతనతో జతగూడి సింగభూ
పుని బ్రీతిభావి శేష పరిపూర్ణు నుదీర్ణు ననంత పాండితీ
ఘను రసవత్కవిత్వ కృతికర్తను సర్వకళావిశారదున్. 4

క. కనవెంచి రాజగిరి పత్తనమున కరుదెంచె మించు తత్పురవిభవ
మ్మును గని యిది యమరావతి మనమున శల్యమ్మునాఁటు మణిగోపురతన్

గీ. అనుచుఁ బోతరాజుకు మల నలరునట్టి
కోటలను బాటలంటు శృంగాటకముల
అందములకు మందిరములై యంబరమును
జుంబనమొనర్చు హర్మ్యాళిఁజూపి పొగడు. 6

చ. 'నగరము యోజనాయతము నల్దెసలంటి సరస్సువంటి మే
ల్మొగసుల నీన మార్గములు సుందర పద్మలతానుకారులై
యగపడ నందు నంగణచయమ్ములు వారిజపత్రశోభలన్
నెగడఁగ హర్మ్యపంక్తి నవనీరజశోభల నొప్పు లక్ష్మితోన్. 7

చ. మల లిరువంక లప్పుర రమారమణీమణిఁ గొల్చి నిల్చు నే
స్గులవలె నొప్పు నౌదల మనోహర కాంచన గోపురాగ్ర సం
విలసిత రాజసౌధములు విశ్రుత భద్రగజద్వయమ్ము మూఁ
పుల చవుడోలు దాలిచిన పొల్పును దెల్పు ననల్పశోభలన్. 8

ధ్రువకోకిల :

మలతలం గలధౌతమృణ్మయమంజుసౌధగణాకృతుల్
తలఁ జెలంగెడి మల్లెమొగ్గల దండలై విలసిల్లునో
నిలిచిపోయిన నీలనీరద నీడమునఁ బొలుపారుచున్
చలనమందక చెల్వుగుల్కెడి చంచలాకృతు లంచలో. 9

క. పీటన్ భూపతి కుచగిరికూటము లన నొప్పు నద్రికూటాగ్రిములన్
నీటగు ముక్తాహారపు పేట లనన్ గొమరు మిగులు పేఁటలు గననా. 10

చ. మసలెడి నాగుకోమలుల మైమలకల్ మనసౌనొయారముల్
కొసరెడి పావురాల మెడఁ గుమ్మటపున్ గులుకుల్ విలాసముల్
ముసరెడి జాతుపిందు మెడమ్రోడ్పులలో మలఁపుల్ మనోజ్ఞతల్
మెసవుచుఁ దేఁచి తీపి రదె మేడలమీఁది యనల్పశిల్పముల్. 11

ఉ. చుక్కల నాడు మంచుమల చుంచుల మించెడి కోటకొమ్ములన్
జెక్కిన పట్టుటెక్కెముల చిన్నెలవన్నెలతో నభస్థలిన్
జిక్కని పాలరాతిని రచించిన రాజమహాళ్ళ చాళ్లపై
నొక్కెడ పాలవెల్లి తడ లోహరి సాహరి నాటలాడెడిన్. 12

సీ. తూర్ణగోచ్చావచ తుక్ఖార హేషాస్వనమ్ముల మను సాహిణమ్ము లవియొ
గర్జద్ఘనాఘన కల్పవారణ బృంహితాళి నొప్పెడి యెకరాలు నవియొ
కీర పారావత శారికా టిట్టిభోత్కర కలస్వనితగోపురము లివియొ
మాధ్వీక మృద్వీకా మదిరాసవోద్భూత సౌనభాన్విత పానశాల లవియొ

తే. రమ్యరాణ్మందిరాంగణా రామసీమ
చంద్రకాంతాశ్మ నిర్మిత చారునీర
కుండికాంతర స్తంభాగ్రమండిత లయి
స్త్రీప్రతిమ లంబుశీకరాల్ జిమ్ము నదిగొ; 13

ఉ. టక్కరి పిల్లతెమ్మెర హఠాత్తు లతాభుజమూల మంటుచున్
జక్కిలిగింత సేయఁ బెలుచన్ బొరలాడుచు నవ్వుచుండెఁ బూఁ
జెక్కిలి విప్పి సౌరభము చిప్పిల నివ్వనలక్ష్మి మోమునన్
గ్రక్కునఁ జీరి వ్రే భ్రమరకక్రియ షట్పదపంక్తి వ్రాలెడిన్. 14

తే. పథములకు నిరువంకల బారుదీరి
కత్తిరించిన జొంపముల్ కరిమయూర
మంజుహంసాది లవలీనికుంజ రచిత
సుందరాకృతుల్ విస్మయ మందఁ జేయు. 15

సీ. సింగిణిన్ రంగారు చిత్రలేఖన వర్ణముల నిగ్గు మొగ్గకుంచెల నలంది
పాతాళలోకపుం బడుచుల నెమ్మేని సోయగ మ్మెరుగుల వాగ్రియుచుండి
జలదభామినుల శీతల మృదుస్పర్శనై జాంగకచ్ఛాయల ననువదించి
నాకాంగనాస్మితానన సుధాశీకరమ్ముల నవ్వ పూఁదేనియల హరించి

తే. నాగకన్యలతో మంతనములు నెఱపి స్వర్గయువతులఁ గూడి ముచ్చటలు సల్పి
ఉభయలోక సౌందర్య కళోపపత్తి భువిఁ బ్రతిఫలింపఁ జేసె నీ పూవుఁదోట.

క. మలయజ మృగమద పరిమళ మిళిత సమీరములఁ జారు మృగనయనలతోఁ
దల లూఁపించుచు నాత్మల బులిపించు న్నగర' మనినఁ బోతన కవియున్.

తే. కొందఱకుఁ బట్టణమ్ముల యందమొప్పుఁ
గొందఱకుఁ బల్లెటూళ్ళ నానంద మొదవు
నిజముగా నమాయికతయు నిర్మలతయు
సరళత యనఁ బల్లెలకే కాఁపురము సేయు. 18

సీ. కమనీయ రాజమార్గములు లేవట దారిఁ
జన వీలుపడని కష్టములు లేవు
భానుతోఁ దలఁ గ్రుమ్ము ప్రాసాదములు లేవు
స్థలముజాలని యవస్థలును లేవు
రక్షక భటులదౌ రాయబారము లేదు
పశ్యతోహర సమార్భటియులేదు
ధన్వంతరులగు వైద్యశ్రేష్ఠులును లేరు
సాంక్రామికామయసరణి యరుదు
తే. తలకుమించి వినోదవార్తలునులేవు
కావలయు వస్తువులవి చిక్కవనికాదు
అతి సుపరిమళద్రవ్య సంతతియు లేదు
రొచ్చుకాల్వ దుర్గంధంపు మచ్చు లేదు 19

ఉ. ఐనను రాచకొండపుర హర్మ్యవిధానములున్ మనోహరో
ద్యానములున్ సరోవరవితానములున్ సువిశాల రమ్య ర
థ్యా నివహమ్ములున్ జనసుఖావహముల్ పరిశుద్ధముల్ కళా
శ్రీ నిలయమ్ము లి ప్పురి వసించు ప్రజల్ నయకోవిదుల్ బుధుల్. 20

వ. అని నుడివె నంత. 21

ఉ. ఒండొరులిట్లు పట్టణ మహోన్నత వైభవముల్ నుతించి బ్రి
హ్మాండముగా వెలుంగు నగరావరణమ్ములు దాఁటి మేటి యా
ఖండలుఁడో యనన్ దనరి ఙ్మాతలజాతసుధర్మయాఁ సభా
మంటప సీమలోఁ గొలు వమర్చిన భూపతిఁ గాంచ నెంచుచున్. 22

క. అరుగుచు నాపణమున నొక యరుఁగుపయిన్ బ్రూవులాకు లమ్ముకొనెడియా
ఘరువాలి యగు యువతి నేమఱుపాటునఁ గాంచి భావమఱఁదులు నిలువన్.

ఉ. విందగు యౌవనమ్ము వెలపించెడి చక్కదనమ్ము నేమియో
యందము చిందులాడు సిగయందు నమర్చిన పూసరమ్ము కెం
పుందళుకుల్ చలించు స్మిత పుష్ప సుగంధితమౌ విడెమ్ము జల్
పొందిక పుల్లిగల్లపుట భూషణమై చెలువారుచుండఁగన్. 24

ఉ. చెంతనె నిల్చియున్న కవిసింహుల నా వగలాఁడి గాంచి య
త్యంత పతూవిలాస మృదుహాసమనోజ్ఞ విలోకనమ్మునన్

గంతుశరమ్ముల న్విసరు కయ్యములోఁ దగు నెయ్య మేను సా
ధింతు నఁటంచు నెంచి కడు తియ్యని భాషణ మొప్ప నిట్లనున్. 25

క. పులిలోడ నేల ప్రాజ్ఞులు దయ సేయుఁడు కప్పురంపుఁ దాంబూలమ్ముల్
ప్రియపడు భవదీయోష్ఠద్వయమునకై రాగరస ప్రదాన మొనర్పన్. 26

తే. సరసగళ సమాశ్లేష వాసనలు పెనఁగఁ
గరము విప్పారు మల్లికాంగనల యొక్క
యలరు దండలు తమరి నాహ్వానపఱచు
ననుట శ్రీనాథుఁ డరిగి యిట్లనియె నగుచు. 27

సీ. 'చెక్కుటద్దము నేలు చిగురు తమ్ములపాకు
వఱలుచున్నది పలువరుస లొరసి
కొమ్మ కెంజిగురాకు కమ్మవాతెఱ లీల
ముద్దిడున్ దాసనమొగ్గ విరిసి
సరససంపద యనన్ జను నాగరంగ ఫ
ములనంద గోరాను లావు మెఱసి
చెమరించు కాంతాననమనంగ శరములన్
బదునెక్కు నదె మహోత్పలము మురిసి

ఆ. పూవుఁ బోఁడి భోగిభోగానుకారి యీ యలరుదండ యెంత విలువ సేయు,
ననిన లజ్జతోడ నాసక్తి పెనఁగాడ సుదతి నగుచుఁ బల్కె సుకవి నరసి. 28

ఆ. 'దండ యిద్ది యెవరి దండఁ జెల్వారునో యట్టివారి ఘనతఁ బట్టిదీని
విలువ యెదుగు వట్టి చిలిపి యాసించిన దండతాడనమ్మె దండ విలువ.' 29

తే. అనెడి పుష్పలావికను గన్గొని కవీంద్రుఁ
'డోసి నెఱజాణ! భళిరె! నర్మోక్తి సొబగు
దండవీడి దూరమ్ముగా నుండు కంటె
దండతాడనమ్మె సుఖదాయక' మనె. 30

క. లలనామణి యొయ్యారము లొలుకఁగ ద్విజుఁగాంచి 'శిశు కోపుదురే మున్
బలికింతు నెందఱినో యీ చిలిపిగుణము శిల్పితనము తిఱిఁగన నెందున్. 31

క. శృంగార శ్రీనాథుఁ డనం గవితల నల్లు మీదు నర్మోక్తులకీ
రథగారు దండతాడనముం గొనుఁ' డని యొడఁధ విప్రేఁ బూదండ వఱిన్. 32

క. తఱుముకొనివచ్చు నవ్వును బోరిఁ బయ్యెదకొనలఁ గఱచి పోనడచి త్రపా
భర చపల వీక్షణమ్ములు నెఱు పెక్కఁగ వేఱువిషయ మేదో తడవున్. 33

ఉ. అచ్చపలాక్షి చారుతర హాసములున్ రసభాషణాదిక
మ్మచ్చటివారి జిచ్చవడు నట్లొనరింప నొయార మొల్క మీ
వచ్చిన కార్యమెద్దియొ కృపన్ సెలవిత్తురె యంచు నాదర
మ్మచ్చుపడంగఁ బోతన మహాకవిఁ గాంచి వచించె నీగతిన్. 34

ఆ. 'బడలినారు చల్లపానీయములు గొండు విరుల వీవనలను విసరనిండు
రండు లోని' కన నతండాడు 'పానంబు జోలి మరియు మీదు గాలి వలదు.

శా. ఓ నీరేజదళాయతాక్షి! భవదీయోక్తుల్ చమత్కార ప్ర
జ్ఞా నిక్షేపము లీ ద్విజుండు రసవత్కావ్యైక నిర్మాణ సు
శ్రీనిర్ద్వంద్వుఁడు వీరిఁ బోల్తు వపర శ్రీనాథుగా నెవ్వరా
శ్రీనాథుండు? వసించు నెందు? నెటు వాసిన్ జెందు వాకుఁ్రిచ్చెదే?' 36

తే. అనుట లా యెమ్మెలాఁడి తా నతనిఁ గాంచి
మధుర దరహాసములు మొల్ల మాల లల్ల
దాడిమ ఫలాల గిల్ల నేత్రములు చలువ
కలువపూ రేకులన్ జల్లఁ బలికె నిటులు. 37

తే. 'ఓ మహామతీ! యల్పజ్ఞ నేమనందు నొక మహారాణి శ్రీనాథసుకవివాణి
రాజులే గారవించెడి రామచిలుక యాంధ్రసాహిత్యవనికి ముత్యాల మొలక.

చ. బిలిబిలి ముద్దుపల్కులను జేతమునన్ గిలిగింతపెట్టు నా
లలితపుఁ జాటువుల్ హారవిలాసము నైషధమాది సత్కృతుల్
తెలుఁగు సరస్వతీ మకుట దివ్యదనర్ఘ మణిప్రతానమై
వెలుఁగుల నీనఁగా విబుధ విశ్వము మెచ్చ రచించె నెన్నియో! 39

క. తెమఁగుం భారతి పూరుషతను ధారణమున్ బొనర్చి ధర శ్రీనాథుం
డను పేరఁ దిరుగునఁట నేనును నమ్మహనీయుఁ గాంచనోఁచ మహాత్మా!40

క. అన విని యా యెయ్యారిని గని పోతన యలరి 'యతని కావ్యముల నిటుల్
వినుతింతు వా కవియె నీ మను విల్చెనఁటన్న నెంత మురిసెదొ' యనుటల్.41

క. కలనైన నగవదని హరి తలవాకిట నిలిచిపిలిచి దర్శన మిడినన్
గ్లానివాఁగ బొమ్మెరయె కవి కుల నిజమైనట్లు ముదముగని యిటు లాడెన్.42

చ. "నరపతి యాదృతిన్ బరిజనమ్ములతో నెదురేఁగి తత్కవీ
శ్వరునకు స్వాగతం బొసఁగి సత్కృతి సల్పి 'మహామతీ! భవ
చ్చరణము మామకీన పరిషద్భవనాంతరసీమలో నలం
కరణ మొనర్పరే' యనినఁగాని యతం డరుదేరఁ డందురే. 43

శా. శ్రీనాథుం డిటు పాదచారి యగుటల్ చిత్రంబు లాందోళికా
యానస్థుండయి చామరాళిఁ గొని శిష్యవ్రాతము ల్వీవ 'వి
ద్యానాథా! కవిసార్వభౌమ !' యను విద్వద్వంది కైవార ని
స్వానంబుల్ బులిపింప నేగునని విశ్వంబెల్ల కీర్తించునే. 44

సీ. సుమనస్సులందె పదములుంచు శారద కాలినడంబోవు కత మదేమి
గణములు వెంటరాఁ గదలి పాదము వేయు భారతి కీయొంటిపాటదేమి
ఘన సువర్ణాభిషేకముల మున్గెడి వాణి యాతపమ్ముల వాడు హేతువేమి
బహుళార్థవై భవప్రదయైనభాషకుఁ దానయి యరుదెంచు దైన్యమేమి

తే. తప మొనర్చినఁగాని స్వదర్శనమ్ము
నీయనట్టి పుంభావ వాగీశ్వరికిని
నప్రియత్నత నగపడు నవసరంబె
కలయొనిక్కమొ యిది యేమొ తెలియ" ననుచు. 45

ఉ. ఇవ్విధిఁ గల్కి పల్క హసియించుచుఁగాంచి వచించె నాతఁ 'డో
జవ్వని! నీవు పల్కినది సత్యమె మత్పరివార సంతతిన్
నివ్వటిలున్ స్వవేమధరణీపతి రాజ్య రమాప్త చిహ్నమి
ద్దవ్వసుధాధినేత యభియాతి భవన్నృపమౌళి కెంతయున్. 46

చ. అహితుని పక్షమం దలరునట్టి జనమ్ము లెవారలైనఁదా
మహితులుగాఁ గనంబడుదు రాత్మకు వారి గుణంబు లెంతయున్
విహితములయ్యు ద్వేషికవె విస్మృత దోషములై చనున్ రుజా
సహితున కన్నమన్నను విషమ్మటులై సహియింపనట్టులున్. 47

ఉ. ద్వేషముఁ గొల్పు చిహ్నములఁ దేవలదంచు దలంచి యిప్పుడీ
వేషముఁ దాల్చి వచ్చితిమి విస్మయమందఁగనేల యాంధ్రవా
గ్యోషకు మాతృభాష కిల యోగ్యతలేదని సంస్కృతమ్మె స
ద్భాషయటంచు మీ విబుధవర్గము మీదు నరేంద్రుఁ డెంచుటల్. 48

చ. విని యిటు లేఁగుదెంచితిమి వీనుల విందిడు పైఁడిపంట మా
తెనుఁగు నిగారపుం గయిత తేనియలఁ గ్రుచి చూపి యాంధ్రివా
గ్వనితను నర్హ పీఠమున వర్తిలఁ జేసెద మీ సదస్సునం
దనెడి గవీంద్రుఁ గాంచి యిటులాడెను నవ్వగలాడి నర్మిలిన్. 49

ఉ. 'ఎంచిన మేల్మి మౌక్తికము నేమి యెఱుంగని బొట్టె గోలి గా
వించినయట్టు లజ్జనయి విశ్వకవి న్నిము నోరుజాటి నే
మించఁగ నాడితిన్ నను క్షమించఁగ నౌ'నని చంద్రబింబమున్
వంచనసేయు నెమ్మొగము వంచి పదాబ్జమునంట మ్రొక్కినన్. 50

క. కనుగొని శ్రీనాథుం డిటులను 'వగవఁగనేల జేల! యపరాధం బే
మొనరించినావని క్షమాపణ వేఁడి కొనంగవలసి వచ్చెను నన్నున్. 51

ఉ. ఈ విబుధుండు పోతన కవీంద్రుఁడు వీరును నేను నిందు మీ
భూవిభుఁ గాంచవచ్చితి మపూర్వ ముదంబొదవెన్ నినుం గనన్
బూవుల రువ్వు నీ సరసపుం బలుకుల్ కవిచంద్రులున్ గళా
కోవిదు లెంతొ మెచ్చిరన కోమలి! యేమనఁ జెల్లు నీ మతిన్. 52

ఆ. త్వరగ నరుగవలయుఁ దరుణి మే మీనాఁడు సింగనృపతి ఘన సభాంగణమున
కనుచు నేఁగఁబూన నాచాన తమకాన ముందునడచి మార్గమును వచించు. 53

సీ. గుజ్జాల కోనేరు కొండయం దేనికల్ కంఖాణములు వేలు గలవు సామి!
ఎక్కటికాం డ్రుక్కుదక్కు వజీరులు తెందేపలుగ నందుఁ దిరుగుచుండ్రు
జెడిదంపుటడిదముల్ నడుములందును వ్రేలఁ బారాలుద్వారాలఁబరఁగుచుండ్రు
ఆముదేనుఁగునైన నచటి మావంతులు మస్తరింతురు విడిమట్టునంతు

తే. రత్న శస్త్రశాలలు పెక్కు లలరు వానిఁ
జిరికివారు గాంచినఁ దలతిరిగిపోవు
పాముగరిడీలు గల పుక్కుభీము నేలు
హొంతకాండ్రుండు రందు దిగ్దంతులనఁగ. 54

సీ. ఇది కచేరీకొండ యిందుండు మన్నియ తామరచెలిచూలి త్యాగమందు
నరవనంటి గమింప చాలుగు వాకిలుల్ గడచిన కచ్చేరి కానఁబడును
వెలకలు తిన్నెలయట్ట నెలవైన రయంగణమ్ములు చాల్పు గానందు నలరుచుండు
వా దివాణము పెక్కు పడుగంటదది యెన్ని త్రాళ్లువేసినను సంకెళ్ళు వావి

తే. దానిలోని నీరమ్మృత సమాన మెన్ని
కలవు లరుదెంచిన నొకింతఁ దలఁగ దదియె
దారి త్వరపడుఁ దేలినవారు ముందుఁ
జనుదు రలవోకకై యుపవనికి ననుట. 55

వ. త్వరపడి యరుగు నియ్యిరువుర శ్రీనాథుండు. 56

క. తొలుదొల్త సుకవి పరిష ద్విలసితుఁడును బహుళశాస్త్ర విహార ద్ధిషణా
కలితుండగు నృపుఁగన్గొనఁ దలవాకిట మెలఁగు చెలువ ధ్యానించు నిటుల్. 57

మ. 'మును నీ దివ్యకటాక్షవీక్షణ కళామోఘప్రభావమ్మునన్
మనుజాధీశులు మ్రొక్క నుంటి ఘన సన్మానమ్ములం గొంటి నేఁ
డును సర్వజ్ఞుని సింగనన్ గదియఁ దోడున్నీడ వీ వంటి నో
జననీ! శారద నీ స్తనంధయుఁడ నా సర్వమ్ము నీ భారమే. 58

ఆ. కన్నబిడ్డ నొరులకై యొసంగెడివేళఁ
జన్నొసంగి రూపు చక్కదిద్ది
యిచ్చునెంతొ వారు మెచ్చి మచ్చికజేసి
ముద్దుగొనిన తానె మురియుననుచు. 59

శా. తేజఃపుంజ విరాజమాన ముఖసం దీప్తుల్ తపోలోక వి
భ్రాజద్బ్రహ్మ కళావిలాస విభవ ప్రత్యూష కల్పమ్ముగా
రాజాగారముఁ జేరు సత్కవులు మార్గం బిచ్చి నమ్రాననాం
భోజమ్ముల్ వికసింప మ్రొక్కు జనమున్ మోదమ్మునన్ గాంచుచున్. 60

తే. క్రొత్త డమ్ములతో నొప్పు కోటగవను
గుమ్మములు దాఁటి కొల్వుకూటమ్ము జేర
ద్వారపాలురు ఔచ్చమై దారి విడిచి
యరుగు పిదప వీ రెవరని యడుగుకొనిరి. 61

సీ. శ్రీశైల శిఖర సంస్పృష్ట సంధ్యారాగ గతిని కాశ్మీర రాంకవము మేన
నై రావణకరాప్త హరిశరాసనలీల మణిమయ స్వర్ణకంకణము కేల
శశధరోభయ పార్శ్వ సందీప్త గురుశుక్రక్రియ రత్నకుండలద్వయము చెవుల
మేరుగోత్రాధృత క్షీరవారాన్నిధి ప్రక్రియన్ గౌశేయపటము కటిని

తే. పంచశీర్షోరగఫణాగ్రభాసమాన మణులనఁగ నంగుళీయక మైత్రి వ్రేళ్ళ
వఱల లక్ష్మీ సమర్చితి వాణియగుచు వచ్చె శ్రీనాథుఁ డచటివా రచ్చెరువడ. 62

సీ. సతతా వ్యయవిభూతి నంపన్నమతి యన భస్మపుండ్రాన్విత ఫాలతలము
భవవార్ధి తారణోపాయమ్మనన కమూల్య కర్ణధారుఁడన రిక్తశ్రీవములు
నిష్కామ మానసనిలయుఁ డీతండన మహిత రుద్రాక్ష సంపదల నెడఁద
బంధముక్తుండయి పరఁగు నీతండనఁ గంకణవిరహిత కరయుగమ్ము

తే. శుద్ధ సత్వగుణోపేత బుద్ధుఁ డనఁగ
ధౌతవస్త్రోత్తరీయములు మేనఁ
దనర వెనువెంటఁ దాను పోతనయు వచ్చెఁ
గర్మ వెనుకనె జ్ఞానమ్ము గ్రాలుకరణి. 63

సీ. శ్రీనాథుఁడుం బార్వతీనాథుఁడును నిట్టి రూపుగాంచిరఁటంచుఁ జూపువారు
సోమ సూర్యులు సదస్యులముందు నరులయి యిటువచ్చిరని వచియించువారు
ఇహపర సౌఖ్యమ్ము లీ యాకృతులఁ దాల్చి యగుపించెనని ముచ్చటాడువారు
భోగీశ్వరత్వమ్ము యోగీశ్వరత్వమ్ము మూర్తిగాంచె నటంచు మురియువారు

తే. ఎవరు వీరని యొండొరు లెంతొ వింత.
గుసగుస ల్వెట్టుకొను చడుగుకొనువారు
నడుగవలెనని నాలుక కడకు రాఁగ
నడుగ శక్తి జాలకయుంట నుడుగువారు 64

క. నిరుపమ విద్యాధర బుధ గురు కవి నివహమ్ముఁగూడి కొలు వమరిన శ్రీ
హరిహయవిగ్రహు సింగన ధరణీపతిఁ గాంచి సుకవి దరియన్ జనియెన్. 65

మ. చని పేరోలగమం దనర్ఘమణి భాస్వత్పీఠికాసీనుఁడై
యనఘుల్ మంత్రులు వాహినీపతులు జోహారంచు బద్ధాంజలుల్
గొని కొల్వన్ గవిపండితప్రకర సద్గోష్ఠీవినోదస్మితా
ననుఁడై వెల్గెడి సింగభూపుఁ గని శ్రీనాథుండు తా నిట్లనెన్. 66

## ఉపేంద్ర వజ్రావృత్తము.

శ్లో. చతుర్ముఖత్వే చతురాననత్వం దదాతు వాణీపతి రబ్జజాతః
చతుర్భుజ రాజామవిలంబి హస్తై ర్వ్యస్తాని దద్యా ద్వసుదేవసూనుః

శివ శ్శివం యచ్ఛతు శైలజాతాపతి ర్గిరీశో రజతాద్రివాసః
వసంతు దేవా స్తవ మంగళార్థంచిరాయురారోగ్యజయోస్తు రాజన్. 67

శా. వపాగ్రిట్టాలక శృంగమూర్ధ విలసద్ వాల్లభ్యచిహ్నధ్వజా
ధి ప్రేంఖన్మసృణారుణాంశుక సముద్దీప్త స్వరూపమ్ము తా
విప్ర ప్రాజ్ఞ కవీంద్ర గాయక నటీ విశ్వమ్ముకై స్వాగతా
భిప్రాయ ప్రకటత్కరాగ్రిమయి పంపెన్ యుష్మదాహ్వానముల్. 68

తే. అవని నరరూపతన్ సింగమైన నీవొ యాచరించు హిరణ్యదానాతిశయముఁ
గాంచి ప్రహ్లాదరక్షణఁ గాఁదొడంగె రాజ్యమెల్లెడ నన నబ్బురమ్మె భూప! 69

క. ధర రాచకొండ గిరికందరముల గర్జించు నీ కొదమసింగం బం
చరిగజము లహర్నిశములు హరివాసరజాగరముల నందె న్ముక్తిన్. 70

సీ. వెలయాంధ్రఁ గని పలువిప్పు నీనగుమొగం బతనుత్వమును బరిహాసమాడు
నార్తుల దయఁగాంచు నాయతేక్షణములు పంకజత్వమ్మున వంకజూపుఁ
బ్రాజ్ఞు లౌదలఁ దాల్పఁ బల్కు నీయధరమ్ము విద్రుమజాడ్యము విప్పిచెప్పు
వరిఁగాంచి బొమముడి నడరు నీ యలికమ్ము దోషాకరత్వమున్ దూలుచుండు

తే. దానధార నర్థులఁ దన్పు త్వత్కరమ్ము
కలభకర మృద్వికీర్ణతన్ గడిగిపోయు
ధర్మపథమును దొలఁగని త్వత్పదమ్ము
కలిని యమధర్మపదముల నిలుపు నౌర! 71

సీ. కనుగీటుటకునైనఁ గాని చక్కగరాని
యనిమిషాంగనలఁట యప్సరసలు
అడుగు భక్తుఁడుగామి యొడయఁడైనను నేమి
ఫలమొసంగదఁట కల్పతరుగణము
గురుబుధుల్ కవులయ్యు నరజాతి కనులమున్
జుక్కలై చనునఁట సురనికరము
కంట కూరుకు లేని కష్టజీవనమున
కంతమ్ము గనదఁట యమరజన్మ

తే. రెప్పపాటులో వలపింతు రిప్పడఁతులు
ఫలము లడుగుల నర్పించు పాదపములు



గోరునకు బోలుదురు సురల్ వీరిలోన
ననుచు నిందుగ్రేడే యిటు భువి నవతరించె. 72

సీ. అక్షిద్వయము గాంచనగు నీ కవుల నర్థి దానవారికి వద్దు దవుల రెండు
నిర్మలాక్షర కళానిధివాట నేపొర్దు నీ రాజకళలు క్షయించఁబోవు
మనుధర్మగతి యిందు మహిపస్థమైలేమి నీశ్వరాగ్రహపాత్ర మెపుడు గాదు
అకలంక విబుధశిష్యానీకయుతువాట గురువు లెందును మౌఢ్యనిరతిగనరు

తే. అల సుధర్మను మించి నీయండ నిచటఁ
గవులు బుధులును గురువులు గలరుగాని
పుడమి కవిచంద్రబుధగురు పూర్తిమూర్తిఁ
గాంచె సర్వజ్ఞుఁడనఁగ నీకరణి భూప! 73

శా. గీర్వాణాంధ్ర వచస్సరోవర లసత్ క్రీడామరాళంబవీ
సర్వజ్ఞత్వము నీదు సొమ్మొ యవు డా శౌద్ధోదన స్వామికిన్
శర్వాఖ్యాకునకున్ రహించె నొరునిన్ సర్వజ్ఞగా నెన్నుచో
నుర్విన్ శ్వానము గాంచి సామజముగా నూహించి కొండాడుటల్'. 74

చ. అన విని భూపుఁడున్ సుమహితాసనమున్ దగ నిచ్చి వారలన్
గని వినయప్రఫుల్ల ముఖ కంజము వాఙ్మధు వొల్కవోయ వం
దన మెనరించి 'మీ సుచరిత మ్మెఱుఁగన్ ద్వరవుట్టు' నన్నఁ బో
తన కవిసార్వభౌముని విధ మ్మిటు ప్రస్తుతిసేసె నాదృతిన్. 75

చ. 'అడరెడి సంస్కృతాంధ్ర మహితాంబుధులన్ బరిషేచనమ్ముగాఁ
బుడిసిట బుచ్చుకొన్న కవిపూజ్యుఁ డగస్త్యుఁడు జాను తెన్గు వం
గడమునఁ గావ్యశారదను గన్న విధాత మథించు కబ్బపు
న్నుడికడలిం జనించిన మనోజ్ఞ సుధాకరమూర్తి యీతఁడున్ 76

మ. కలఘోష మ్మను డిండిమప్రవరు ఢంకామ్రోగఁగ ముక్తాసభా
విలసచ్ఛాస్త్ర పురాణ కావ్యరచనా విజ్ఞాన సామ్రాజ్య ని
స్తులపీఠిన్ గనకాభిషిక్తుఁడయి యెంతో కీర్తి దీపింపఁగా
వెలసెన్ సత్కవి సార్వభౌముఁడన పృథ్వీనాథ! శ్రీనాథతన్. 77

తే. అంధ్రశృంగార నైషధా ద్యనుపమాన
కావ్యఖని శాస్త్ర సాహిత్య గగనరంగ

దుర్నిరీక్ష్య మధ్యందినద్యుమణి విమత
వాది మదగజాటోప నివారక సృణి. 78

క. నానాదేశ నృపాలాస్థానములన్ సిరులఁ దోఁగి తానములాడెన్
దా నీతని శారద' యన శ్రీనాథుం డిట్లు వల్కు స్మితసంగతుఁడై. 79

శా. 'పాండిత్యమ్ము పదమ్ము లంటి కొలువన్ భావ ప్రసూనమ్ములున్
గండూషింప మరంద మంజుల రసాఖాతమ్ములన్ జాజిపూ
దండల్ గూర్చు తెనుంగువాణి తలపైఁ దాల్పన్ నృపా! పోతనా
ఖ్యుం డీతండు మదీయభావుకుఁడు ముఖ్యుం డాంధ్రకావ్యావనిన్. 80

క. కరమున్ జాచుట హరునకె వెఱచుట లఘుములకె కన్నువేయుట లన సుం
దరకవితాంగనవయినే శిరమునువంచుటలు గుణవిశిష్టతకె నృపా! 81

ఉ. ఆరయ నీతఁ డెంతయు వయస్సునఁ బిన్నయనంగఁ దోఁచు, బం
గారమువంటి మేల్కవిత గాంచిన మిన్న యనంగనోఁపు మున్
మీరె యెఱుంగువా రితఁ డమేయగుణాఢ్యుఁ డఁటంచు నింతకున్
గారణజన్ముఁ డీతఁ డనఁగావలె నీవలె నగ్రపీఠికన్. 82

ఉ. బమ్మెర యీ కవీంద్రుని నివాసము కాలపటమ్ము నా నివా
సమ్మట తావకీన గుణ సాగరభూత యశోరమా విహా
రమ్ముల సొమ్ముగా నుదధిరాయనిపట్టి రమాకుమారి తా
నమ్ముడుపోవు నంచు విన నక్కజమై కనవచ్చితిన్ నృపా!' 83

చ. అనుటయు సింగభూపతి సమాదృతి నీగతిఁ బల్కె 'నోర! మీ
యనుపమ ధీవిశేష సముదంచిత భవ్యకలావిలాసినీ
ఘనత నుతింపఁగాఁ దరముగా దికఁజాలుననంగ నాల్కరా
దినుఁడు ప్రతీచిఁ జేరఁజను నేను పురోపవనిన్ జనన్వలెన్. 84

క. కావున మీ రచటికి రా సేవించెద నింక నాకు సెలవిం' డనుచున్
భూవిభుఁడు వెడలఁబూనుట యావత్ప్రజ నిలిచి ముకుళితాంజలి మొక్కెన్.

సీ. రాజేంద్రుఁ డా హజారము వీడు నను నంత
నగరు భేరీజయనాద మెసఁగెఁ
బట్టపుటేన్గు సంబర మాఁపలేక తొం
డము నెత్తి వడి బృంహితములు సేసె



మన్నెవారలును సామంతులున్ మంత్రులు
దళవాయిగమి సలాములు బొనర్చె
వందిమాగధుల కైవారసంగతజయ
ధ్వానముల్ సన్మార్గతలము ముట్టె

తే. నిలువు టంగరేఖలు వ్రేల నృపుని ముందుఁ
బట్టు వెట్టెంపు తలవాలఁ బ్రణతిసల్పి
యడుగులందు సమ్మార్జిగ లిడి నృపతికి
వీవధముఁ జూపుచున్ జనవేత్రధరులు. 86

శా. తారుణ్యప్రభ తాండవింప ముఖపద్మ మ్మాను శృంగమ్ములై
బారు ల్దీర్చిన నీలిమీసముల తేవల్ సింహగాంభీర్య సం
భారమ్ముల్ వెదజల్లు భీతుణములున్ బాంతు ప్రవేష్టాఢ్యతన్
ధీరోదాత్త మనోహరాకృతి సముద్దీపింప భూపాలుఁడున్. 87

చ. వలిపపు కండువా భుజముపై నొక ప్రక్కనఁ బాముకూసపున్
దళుకుల వేల్ల మేల్మి జరి దాపిన ముచ్చెల కాళ్ళదోతి పిం
జల జలతారు నాట్యమును సల్ప మదేభవిలాసయానపుం
గలుములు కాళ్లుబట్టుకొనఁగా నవరోధముఁ జేరఁబోవుచోన్. 88

సీ. చారు నిష్కుటముఖ ద్వారానఁ జీరాడు
తోఁపుతెరం గడఁద్రోచె నొకతె
బంగారు శృంగారముం గేలఁగొని చేని
యడుగులం గడిగి నీరద్దె నొకతె
భూపాల రూపరేఖా పాదఫాలమ్ము
మించు దివ్వెల నురాళించె నొకతె
రమణీయ సుమగుళుచ్ఛము రాయని కొసంగి
పన్నీరమున్ జిల్కఁ బడఁతి యొకతె.

తే. తోరణాల ద్వారముల మారువారువమ్ము
లనఁగనముపు కత్తియలు సౌధాళిమండి
కోడిగము లావటించెడి కోపుచూపు
లలర వలరుపోనలఁ జల్లి రతివపుమీఁద. 89

క. మనసెచ్చట నుండునో యా మనిషియు నచ్చటనె తాను మనియుండుననన్
వనిత లొనర్చు సపర్యలఁ గనఁ డా యెకి మీఁ డెడంద కవివశమగుటల్. 90

చ. 'తెనుఁగు కవిత్వమన్నఁ దరిఁపుగఁ జూచితి నిన్ని నాళు లా
తెనుఁగు కవిత్వ మిట్టితటి తీపిగఁ దోఁచి శిరమ్ముఁనూఁచితిన్
ఘనులు కవీశ్వరుల్ ద్రుహిణకల్పు లనల్పు లపూర్వ శిల్పు లే
మనవలె వారికైత కెద యమ్ముడువోయె నటంచు నెంచుచున్. 91

మ. జగజంపౌ మగమానికంబులును బచ్చల్ కెంపులు నీలముల్
సొగసౌ ముత్తియముల్ ప్రవాళములు జజ్జు ల్వాసి మేల్జాళువా
నగతోఁ గూడి వెలుంగునట్లు తెనుఁగుల్ నానారుచుల్ రూపముల్
నిగుడన్ సంస్కృతభాషఁ గూడి మది కెంతే వింతఁ గొల్పున్ భళీ! 92

శా. ఆ వాగ్వశ్యత యాకళావిభవ మయ్యారే! జగద్వంద్య మా
భావౌన్నత్యము పాండితీపటిమ దివ్యత్కల్పనాశక్తి భా
షావాల్లభ్యముఁ జాటు దీటుగలదే శాస్త్రజ్ఞతన్ వీరలన్
సేవింపం దగు భాగ్యమబ్బుట ఫలించెం బూర్వపుణ్యౌఘముల్. 93

క. ఈదిన మేమో ఘనవాగ్వాదము సేతు ననుకొనిన వాక్కు పెకలదీ
మేదిని పొత్తము ముత్తోరాదుగదా దివ్యదిహపర ప్రకృతులతో. 94




తే. నవరసంబుల చవులూర వివిధగతులఁ
గవిత గీర్వాణమటు లల్లఁగలదు తెలుఁగు
బాస యనిపించినారు సెబాసు! వీర'
లని వయాళికి నుపవని కరిగె నృపుఁడు. 95

ఉ. అంత నృపానుజీవి యొకఁ డాదర మొప్పఁగ నేఁగుదెంచి యా
కాంతుని యానతిన్ గవియుగమ్మును దోడ్కొనిపోయి రాజహ
ర్మ్యాంతిక భాసురోపవనికాంతరసీమ మనోజ్ఞ మల్లికా
క్రాంతనికుంజ బింబితవిలాసవితర్దిఁ బ్రవేశ పెట్టినన్. 96

తే. చారు చంద్రికాంతోపల స్థగిత వేది మల్లికాశీతలచ్ఛాయ మంజుపీఠి
కల సుఖాసీనులై యుండి కవివృషభులు మోహనోద్యానశోభకు ముగ్ధులైరి.

శా. లీలోద్యాన విరాజమాన తరువల్లీ కుంజవైవిధ్య శో
భాలోకన్నయనారవిందములు మోదాంభోనిధి న్మగ్న భూ

సాలాభ్యర్థితులై కవీంద్రులు వనీవామా సుధాస్యంది డో
లా లోలాయిత మానసంబయిన కేళాకూళి డాయంజనన్. 98

మ. కులకాంతామణి దర్పణాయిత చతుష్కోణాఢ్య ఖేలాసర
స్థలి సంధ్యారుణిమమ్ము కుంకుమిడె భాస్వచ్చంద్రకాంతామలో
పల రాణ్మంటప గోపురమ్ము సరసీవారిన్ వనీభామినీ
తిలకార్థమ్మిడు రౌప్యపుం భరణి రీతిన్ వెల్గె నచ్చోటికిన్. 99

క. వడివంక లేక యొడ్డుం బొడువున్ బొంకమ్ము గల్గు భూపుఁ డొడలి పు
త్తడి నిగ్గు తళతళల్ మ త్తడి దూఁకుచు నంగ రేకు మాటుం దాఁటన్. 100

చ. వడిగొని పట్టుకుచ్చులను వంకలు బెట్టెడి నీలి ముంగురుల్
విడివడి పింజలై నిటల వీథిని గాలిని దేలియాడఁగాఁ
దడగొను నీలిమబ్బుతెర దాఁగెడి యానెలబాలు ముదలిం
చెడి మొగ మొప్పవచ్చి కవి సింహులమున్ దలవంచె వారునున్. 101

ఉ. 'మృగ్యుఁడు త్వాదృశాఢ్య కవిమిత్రి చరిత్రుఁ డిలన్ చిరాయురా
రోగ్య జయోస్తు! భోజసమరూప! యటంచు వచింప లేఁడు నా
భాగ్యము పండె లతలిడి ప్రార్థనచేసిన వచ్చువారె మీ
యోగ్యతలెన్న నెంతయు మహోన్నతముల్ సుదినమ్ము నేఁ డనెన్. 102

తే. 'కవులు మీరు నిరంకుశుల్గాన నేను
ప్రశ్నయింతు నా హృదయవాంఛను వచింప
వైన వచియింపరాదని యాగలేను
నిగ్గు విడఁజేయు రసలుబ్ధ శీల మెందు. 103

క. రమణీయార్థప్రదమై సుమనోజ్ఞాలంకృతులను శోభిలు వాణిన్
శ్రమ యనక యిందుఁ బ్రత్యతము సేయఁగ విన్నవింతు క్షమియింపవలెన్.

ఉ. అనువు కన్న భావమవనాత్మకమైన కవిత్వమే సుధా
పేశల మాధురిన్ శ్రవణపేయసుఖమ్మొనగూర్చు సర్వసం
కాశ నదీప్రవాహ జలగర్భమువన్ లభియించునే గభీ
రాశయ జోలికా లహరి పాడు సరిత్పతి రత్నసంతతుల్? 105

తే. అనుచు భావింతు నది కల్లయయ్యె నేఁడు
దివ్యచాటుధాటిక రసవది నైఁ గూరు

గొప్పలగు కావ్యకవితల గుప్పినారు
మెప్పు గొనినారు నేనేమి చెప్పగలను ? 106

వ. ఐనను బెను పయనంపు టిడుముల సుడివడియున్న మిమ్ము శ్రమవెట్టజాల నెల్లియుల్లము రంజిల్లజేయు మొల్లంపు కవితల వినవలతునని యనిపి మరునా డదే సమయంబున కవులంగని 107

క. క్షితితల ప్రత్యేకతయున్ బుతుగతి యను దేశకాల నియతస్థితులన్
మితిమించి పూచి కాచెడి లతలున్ దరుగుల్మములుఁ జెలఁగు ని వ్వనిలో.

తే. నేను బ్రత్యహ మివ్వనినే వసించి కావ్యలేఖనా వ్యాసంగ గతి నెఱపుదు
తాము రసయుక్తసత్కావ్య సామఫణితిఁ బల్కఁగోరుదును వ్యాన భవ్యశోభ.'

క. అన విని శ్రీనాథుం డా వనశోభ నొకింతఁ గాంచి భావించెడి భా
వన నాళుగతి మధుర నిస్వనమొప్పఁ గవిత్వరీతిఁ బాడఁదొడంగెన్. 110

తే. 'ఇవ్వనియొ జవ్వనిం బోలి యెలమి మీఱఁ
పుష్పవతియౌటచే భృంగభోగ్యమయ్యె
నేతదారామ మా రామ నృపతివోలె
నలరి ద్విజవాంఛితమ్ము సఫలమొనర్చె. 111

శా. కాషాయాంబర శోభ నర్యముఁడు సాక్షాత్కర్మ సన్న్యాసపున్
వేష స్వీకరణం బొనర్చె నపరాబ్ధిన్ మున్గి, తాఁ బద్మినీ
యోషారత్నము కన్నుమూసెఁ బతిహీ నోర్విజ గనంజాలమిన్
ఘోషించెన్ దివిఁ బక్షిసంతతులు దిక్కుల్ మోము మాడ్చెన్ వెసన్. 112

మ. నెలరాజున్ వలపింపఁగా సురనదిన్ నీరాడి చెంగావి దు
వ్వలువల్ దాలిచి మబ్బుకన్నియలు చెల్వం బొప్పఁగాఁ దారకా
తిలకంబుల్ ధరియింపఁ జీఁకటికురుల్ దీపింపఁ గ్రీడాసర
స్సలనన్ గాగ్రిలెడి నిల్వుటద్దములఁ జూచున్ గన్దొవల్ విప్పఁగన్. 113

సీ. పచ్చందనమ్ము దివ్యచ్ఛత్రములఁ బూని
మినుముట్టె వృక్షమ్ము లనెడి మిషగ
మరకతప్రభ మహాంబరముపై ధ్వజమెత్తె
ఘనపూగ వృక్షమ్ము లను నెపమున

హరితవర్ణము పృథ్వి నాక్రమించి తురాయి
తలఁదాల్చెఁ దృణసస్యధామ మనఁగఁ
బసరికల్ గగనమున్ బంధింపసాగెను
జారులతా నికుంజము లనంగ

తే. వివిధవర్ణముల్ కనులకు విందొసఁగుచుఁ బచ్చవన్నియ పైఁబడి వలచి వచ్చి
విచ్చి విహరించి పూవాన విరియఁజల్లి వెడలిపోవు నేపూఁటను దడలవోలె.

సీ. కన వ్యూహములఁ బన్ని కంటిపాపల రెంటి
బంధించెను గులాబిపడఁతి యొకటఁ
బట్టపవల్ చుక్క లట్టె చూపెను లస
న్మహితేంద్రజాలాల మల్లె యొకట
పసిఁడి ముద్దలలో సువాసనల్ సృష్టించె
సేమంతికా సుమస్తోమ మొకట
విచ్చుకత్తుల పొదుల్ విరిలోనఁ జూపించెఁ
గేతకీ పుష్ప సంఘాత మొకట

తే. మధురసాభోగ హేమకుంభములపైన
నీలమణి పాలికల మూఁత గ్రాలు ననఁగఁ
దమ్మి మొగ్గలపై వ్రాలు తుమ్మెదలును
బద్మినీ కుచ చూచుకప్రభలు జిమ్మ. 115

సీ. తాంబూల చర్వణ దంతపంక్తులతోడి దరహాస మొనరించు దాడిమమ్ము
ఆకుపచ్చని వన్నె కోక కొమ్మలయొడిన్ బండునా పసినిమ్మపండు బుడుత
శిబి సిగ్గుపడఁ గండజీల్చి పసిండి మేఁ శుకమున కిడు త్యాగి చూతఫలము
రంభాధరామృత రసనీత నవనీత మలమెఁ బచ్చని పొట్ల మనఁటిపండు

తే. స్వచ్ఛ మందాకినీవారి సంగ్రహించి
తల ధరింపఁగ నెండవానల సహించి
మూఁడు కనుల మూసియు మీసములను గడ్డ
ములఁ బెంచు నారికేళ సత్ఫల తపస్వి. 116

ఆ. చేయవట్టి ఘటము వేయని సున్నము పోయనట్టి మధుర తోయములగు
నారికేర మవని రాలిపడం బగు శ్వ్యాదవస్రట్లు షీఁచుఁ బోదిగ నెవఁడొ. 117

తే. పొంగి కైలాసగిరిఁ జాఱు గంగనీరు
కామధేనువు పాలమీగడల తీరు
మూఁకుళుల మూసి ముక్కంటి ముద్రవేసి
తీర్థము ప్రసాదమని యిందు దింపి రెవరొ. 118

క. అరవిందమ్ము లశోకము లరవిరి మల్లియలు మావి యలరులు కలువల్
స్మరశర గురుప్రభావము మరిమరి యిటు విప్పిచెప్పు మఱతురె యనుచున్.

సీ. తొలిమబ్బు తెర నుండి తిలకించు చుక్కల
దొరఁ గాంచి కనుగీఁటు తొవపడంతి
భ్రమరమ్ము మోవిపైఁ బడి క్రోలఁగను లఱ
మూసి చొక్కెడి తమ్మిముద్దరాలు
తీఁగల నుయ్యాల లూఁగు సమీరకు
మారుతో నగుపూవు మగువ మిన్న
పికరాగ వివశయై స్వకరాగ్రముల సైగ
లను జేయు చూతపల్లవకుమారి

తే. ప్రియవసంత సమాగమవేళ యగుట
వనవిలాసిని నూత్నయౌవన మనోజ్ఞ
శోభ పెనుపొందఁ దీరైన సొమ్ముఁ బెట్టి
వల పొలయరాగమాధురుల్ జిలుక నవ్వు. 120

వ. ఇత్తెఱంగున శ్రుతిపర్వముగా మతికి నాహ్లాదకరముగా ముఖకమలవినిర్గతమగు.

క. శ్రీనాథ కావ్యమధురస పానోన్మత్తాత్ముఁ డగుచుఁ బార్థివుఁ డుండన్
దా నా పోతన నిజకావ్యానంద సుధారసమ్ము లతని కిటు లిడెన్. 122

క. దళపుష్ప ఫలజలమ్ముల నలఘుమతిన్ విశ్వరూపి నర్చించుచు ని
శ్చలవృత్తిఁ బొల్చు జన్మ సఫలతన్ గనునంచు ననుభవముఁ దెల్పుఁ దరుల్.

ఉ. మానిత సూనసౌరభరమాకృత మారుత యావ్యయాన మ
మ్లాన సుమప్రమోదకర మౌఖరిత ద్విజసామగాన మా
పీన లతావితానము నభీష్టఫలప్రద భూజరాజ సం
స్థాన మహీన మివ్వన విధానముఁ గానము క్షోణి నెందునున్. 124

మ. తలక్రిందుల్ తపమున్ బొనర్చు నిటులీ ధాత్రిన్ దరువ్రాత మే
ఫలసిద్ధిన్ మదిఁగోరియో పవనమున్ బానీయమున్ గ్రోలి ని
శ్చలచిత్తుంబలె నెండ వానల శ్రమల్ స్వాంతంబునం దోర్చి ప్రా
ణుల కర్పించును దత్ఫలమ్ము లివియేనో సత్తపోధ్యేయముల్. 125

మ. అలఘూర్మిస్వన భాసమాన మయి హంసాందోళికాయానమై
జలపూర్ణంబయి శీతలానిలసుఖస్పర్శాత్మకంబై కళా
నిలయంబై యతి నిర్మలంబయి మిల న్నీరేజగంధాఢ్యమై
కొల నొప్పెన్ బలు మెట్లతో సమచతుష్కోణాకృతిన్ విస్తృతిన్. 126

మ. కలహంసధ్వనితో సుధాస్మిత లసత్కంజాస్య బింబమ్ముతోఁ
జలదుత్తుంగతరంగ హస్తములతో సంఫుల్ల నీలోత్పలా
తులతో స్వాగతమిచ్చుచుణ దివి నిలన్ జూపించు దివ్యామృతం
బులతో నర్ఘ్యమొసంగుచున్ విబుధులన్ బూజించుఁ గాసారముల్. 127

సీ. కల్లోల వనమాలికా డోలికలఁ దేలి తూఁగాడుచుండు బాతువుల పిండు
గర్భభారాలసగతి నేలు చూలాలు గొనబైన నడ వచ్చి కొలను జొచ్చి
జలమగ్న ముకుళాంబుజాత సంఘాతమై ప్రతిబింబతతి తేటపడఁగ నీట
విమలాంగకము మల్లె విరితెప్పయై తేల నాగుబామై మెడ నాట్యమాడ

తే. నీఁదుచున్ మున్గి తేలుచు నెఱకలందు నొక్క జలకణమ్మేనియు నొత్తనట్లు
వచ్చి దరిఁజేరు సంసారవనధిలోన నంటియంటక మనెడు బ్రహ్మణ్యు నట్లు.

ఉ. వాసన యెంతయున్న నిజవర్ణము లెట్టివియైనఁ గ్రిందు న
గ్గాసనమందుఁ గ్రాలియు ముదాకృతి నవ్వుచునుండి రెండునా
ళ్లీసుమజాతి జన్మ ధరియిత్రి సమర్చల నేల వ్రాలు నౌ
రా! సురరాజి వీనిని శిరమ్మునఁ దాల్చుటఁ బూజ్యతన్ గనున్. 129

మ. పికసంఘమ్ములు వేణునాద విలసత్ప్రియూష పేయమ్ము లో
పికతోఁ బంచుఁ బ్రసూనముల్ ప్రతిఫలాపేక్షన్ వివర్జించి హ్లా
దకరామోద మరుత్తరంగములఁ జేతస్సంహతిన్ ముంచు న
మ్మకపున్ వీథుల నుంచు నేల కవి నిర్మర్యాదతన్ సత్కృతిన్. 130

ఉ. ఇన్నితరాలనుండి రచియించిన యౌవనకావ్య గర్భమం
దెన్ని వసంతకోకిల లిగురెత్తుచు నవ్వుల నాట్యమాడెనో

కన్నుల నశ్రుబిందువులు గార్చుచు నాకులపాటుతోడ ని
ల్లెన్ని గతించెనో శిశిరవృత్తము లెవ్వఁ డెఱుంగువాఁ డిలన్. 131

వ. అని యనతిదూరంబున మిన్నుముట్టు వైభవమ్ములఁ దులఁదూఁగు విశాలరసాల
ముం గాంచి. 132

సీ. పైకిఁజూడ నొకింతఁ బచ్చపచ్చగనుంట
నెనిలుండు నుయ్యాలల నిడి యూఁపుఁ
బ్రితిదిన మ్మింతింతఁ బైకివచ్చుటఁ గాంచి
జడిసి యానీడకున్ జనఁడు రవియు
నొరుల నీడంబడి యుండకుండుటవల్ల
నాత్మాభివృద్ధి యే రాఁపలేరు
రక్షింపుమని మహీకుక్షిలోఁ దలనిడన్
దనజీవన మ్మది ధారవోయు

తే. ధనికుఁ డీరీతి లౌకికాదరముఁ బొందుఁ
బలిని గని లోక [illegible]గి భయముఁ జెందు
దైన్యరహితున్ [illegible]ద్ధి తప్ప దెందు
ధాత్రి యొక్కఁ [illegible]ంచు బీదజను నెందు. 133

క, అనుచున్ భూరుహ నివహ మ్మనుదిత జీవిత రహస్య మామూలాగ్ర
మ్మనుభూతిఁ బొంది సకలము కనులకుఁ బ్రత్యక్షపఱచుఁగాదె నృపాలా!'

వ. అని యీగతిఁ బోతన నిజకవిత్వ పవిత్ర గాంగఝురులఁ బ్రవహింపఁ జేయు
టయు.

ఉ. జ్ఞాన విశేష శేషుల నగాధ మనీషులఁ గాంచి వారిదౌ
పీనుల విందొసంగెడి కవిత్వ పటుత్వ మహత్వ మెంచి భూ
జాని స్మృతిన్ ద్యజించి యటు సాంతముగాఁ జెవులప్పగించి స్మే
రాననుఁడై వినెన్ గడు కృతార్థుఁడనైతి నటంచు వాకొనెన్. 136

చ. జలజల పూలురాలి నటు చల్లని మెల్లని పిల్లతెమ్మెరల్
తెలతెలవాఱి వీచినటు తియ్యని కమ్మని పాలమీఁగడల్
తొలితొలి తోడువిచ్చినటు తొరపు సిగ్గున ముగ్ధ కన్దొవల్
వలపులఁ జిమ్మునట్లు చెలువ మ్మొలికించు భవత్కవిత్వముల్. 137

ఉ. పూలను మల్లికాలతకు మూలములందు నుశీరజాతికిన్
వాలెము నాకులందు మరువమ్ముకు దారువునన్ బటీర వృ
క్షాళికి సౌరభమ్ములయుఁ గాని భవత్కవితాలతాంగనన్
గ్రాలు పరీమళమ్ములు సుఖప్రదమై సకలాంగకమ్ములన్. 138

ఉ. ఈగతి సింగభూపతి కవీశ్వర కావ్య కలావిలాసమున్
ధీగరిమమ్ము మీఱ వినుతింప నుదార్థితుఁ డొండుచేని పా
ర్శ్వాగతుఁడై వినమ్ర వదనాంచితుఁడై ప్రభుదర్శనార్థమై
వేగరి యేఁగుదెంచెనని విన్నపముం బొనరించె నంతనే. 139

ఉ. వానిఁ బ్రవేశపెట్టుమి యవశ్యముగా నని యాజ్ఞయిచ్చె భూ
జానియు ద్వాస్థితుండు నృపశాసన మౌదలఁ దాల్చినట్లు న
మ్రానమఁడయ్యెఁ జిత్తమని యచ్చోటుఁ జెచ్చెరవీడె సత్కవుల్
తోనె యనుజ్ఞవేడిరి ప్రదోషవిధుల్ నెరవేర్ప గోరుచున్ 140

క. కవు లేఁగుటయుం బ్రణిధియు సవినయగతి నేగుదెంచి జనపతికి "జయీ
భవ" యనుచు మ్రొక్కి జనపద వివిధ రహస్యముల నందు వివరింతుననన్.

వ.. అంత నమ్మహీపాలుండు. 142

క. 'హితమతివి రాజనీతి సుచతురుండవు సత్కవిత్వ సాహిత్యకళా
యుతుఁడవు వినయవివేక నిరతుఁడవు త్వాదృశుఁడు ప్రణిధిరాజిం గలఁడే ?

తే. అన్ని విధముల నీవు మా కాంతరంగికుఁడవు విశ్వసనీయచారుఁడవు మాదు
రాజ్యభృత్యులలోనఁ బురాతనుఁడవు వార్త లేమి తెచ్చితి' వన వార్తికుండు.

వ. వినయవినత మస్తకుండై. 145

చ. "ప్రభువులు చిత్తగింపవలెఁ బల్లియ పల్లియ యిల్లు నిల్లునున్
పభసభ జుట్టివత్తు భువి సర్వదిశల్ చరియింతు మేఘస
న్నిభ సుమగాత్రి యొక్కతె యనిందిత చంద్రనిభాస్య యోర్తుఁ దా
మిభవరయానసంపదల వెందుమ ముం దరుదెంతు రిన్నడిఁ. 146

సీ. ఆహారమే లేక యమృతమానెడి యున్కి
దివియందె కాని యీ భువిని లేదు
అంబరమ్మున విమానా ర్తి చెలంగుట
దివియందె కాని యీ భువిని లేదు

అల కళానిధియు దోషాకరుఁడై యుంట
దివియందె కాని యీ భువిని లేదు
అగ్నిమాంద్యమ్మున కౌషధమ్ములు లేమి
దివియందె కాని యీ భువిని లేదు
తే. రాజు పక్షపాతమున విరాజిలెననఁ
బొసఁగు దివియందె కాని యిబ్భువినిఁ గాదు
తవరు ఘనజీవనము నిరాధారవృత్తి
ననిన దివియందె కాని యీ యవనిఁ గాదు. 147

తే. అనుచు నేలినవారి రాజ్యమ్మునందు
నన్నవస్త్రముల్ చదువు సంధ్యలు సమృద్ధి
వఱలఁగా ననామయతనుఁ బరఁగుచుండు
నఖిలజనమని పల్కెఁ జంద్రాస్య తాను. 148

వ. అంత నో వెలఁదీ! మీ రెవ్వరని ప్రశ్నింప. 149

ఉ. యాచక పాణిపద్మముల నాడెడి శ్రీని ప్రజానురాగమున్
దోచి స్తుతిస్వరూపతను దోఁచెడి వాణినిఁ ద్యాగపాణియౌ
రేచమచర్ల సింగమయ ఱేనికి నే దొరసాని నంచుఁ దా
గోచరమయ్యె నా కనులకున్ దమ కీరితిరాణి భూవరా! 150

చ. ప్రజలకుఁ దల్లి పండితుల పాలిటి కల్పకవల్లి కర్షక
వ్రజమును శ్రీల సౌఖ్యముల రంజిలఁ జేసెడి పాలవెల్లియై
నిజమును న్యాయము న్మనుచు నీదగు కీర్తిరమామతల్లి తా
సుజనులచేతఁ బూజగొని చొక్కెడి విశ్వమునందు నెందునున్. 151

క. గిరికుచతటి ఘననీలాంబర మొరయుచు మెఱయఁ బసిఁడిభాగ్యము గురియన్
వర సస్యశ్యామల సుందరగాత్రి ధరిత్రి వపువు ధరియించె ననన్. 152

వ. అద్వితీయ సుందరియగు నా ద్వితీయసుందరి నన్గాంచి దరహసిత సుందర
వదనారవిందయై. 153

సీ. ఆదిశేషుండు విద్యావేత్తయే కాని
ప్రకటించు రెండు నాలుకల తనము
అహిరాజు తలఁదాల్చి యేలెంచునే కాని
రొమ్ముక ప్రక్క గరళమ్ము నోలుకఁబోయు

హరిపేర పాఁపజేఁ డిరవొందునే కాని
దిక్కరిసాయ మర్థించుచుండు
చిలువలఱేఁడయి చెలఁగు నీతఁడు గాని
ప్రాణభక్షణ వృత్తిఁ బరఁగుచుండు
తే. సతము కౌటిల్యగతిఁ దానె సంచరించుఁ
దనరు నెందు రంధ్రాన్వేష తత్పరతను
నందులకె వాని వీడి సింగావనీంద్రు
వలచియుంటి భూసతినని పలికె నధిప. 154

ఉ. ఇంకొకవార్త దాని నిపు డేలినవారికి విన్నవింపఁగా
జంకొదవు న్వచింపమిని స్వామికి ద్రోహమెనర్చినట్లెదో
సంకటమొందు డెందము ప్రసన్నమతీ! క్షమియింపవేఁడు నీ
కింకరుఁ డాజ్ఞఁ నొంద దమకించు" నటన్న నృపాలుఁ డిట్లనున్ 155

ఉ. 'జగతి జనమ్ము లెప్డు తన చాటున దన్నుగురించి గొప్పగాఁ
బొగడెడి వాగ్విలాస మదెపో నిజమైన పొగడ్త యద్దియే
తగినటు లాత్మతృప్తినిడి తన్ను నెడందను స్వస్వరూపమం
దగపడు మేని నీడవలె నయ్యది నామమునంటి యుండెడిన్. 156

మ. మును శ్రీరాఘవు నంతవాఁడును జనామోదమ్ముతో రాజశా
సన నిర్మాణమొనర్చె నెయ్యెడఁ బ్రజా సంక్షేమమే కోరు రా
జునకై చారుముఖమ్మునంటు శ్రీవణాతుల్ చారుకర్ణాతులై
ఘనసాహాయ్యమొనర్పుఁ బాలక మహత్కర్తవ్య నిర్వాహతన్. 157

ఆ. ఇనునికంటె ముందె చనుదేరి జగతినిఁ గాంచి యతని ముందు నుంచునట్టి
వేగుఁజుక్క కరణి వేగులవాఁడునుఁ గనుల విప్పఁజేయు మనుజ విభుని. 158

ఉ. కావున వేగువాఁడు తన కన్నది విన్నది యున్నదున్నటుల్
భూవిభుచెంత నంతయునుఁ బొందికఁ జెప్పఁగ నొప్పు నెప్పుడున్
గేవల నిందయంచు మదికి భ్రమయానని దాని మానుటే?
త్రావ విషమ్మటంచు వగదమ్ము నొసంగని వెజ్జు లొప్పుతే?' 159

చ. అమట యథార్థవర్ణుఁడు వహాదరబుద్ధి మహీంద్రువాక్యముల్
విని "ప్రభు కీర్తి కౌముదుల పీళ్లె వకీర్తితమోంధకార మో

యనఘ ! త్వదీయసేవకున కా భయ మేటికి గాంజ దుర్వనిన్
ఘనతులసీప్రరోహమును గంటిని విస్మితబుద్ధినుంటినేన్. 160

చ. నరవర ! నిన్న రేయి రఘునాయక సుందర మందిరాంగణా
వరణ కవాటకంఠమున వర్తిలు చారు శిలావితర్దికో
పరి వసియించియుంటి హరిపార్శ్వగృహస్థిత దేవదాసి ముం
దిరువురు స్త్రీలుఁ జేరి వచియించుచునుండఁగ వింటి శ్రద్ధమై. 161

గీ. వాలకముఁ గాంచ వారలు వారకాంత
లనుచు ననుమాన మొదవె వయస్సు గాంచ
నుభయులుం దల్లిబిడ్డలై యుందురనుచుఁ
దోఁచె నిజమయ్యె వారివాగ్ధోరణి నది. 162

క. జనపాల ! వారి యిరువురఁ జననియనం దనరు వృద్ధ సాటిగణికతోఁ
దనకూఁతును జూపుచు నిట్లనఁదొడఁగె విచారవిలసితానన యగుచున్. 163

క. ఇది జన్మించుట నాదొక యదృష్ట మనుకొంటి నూర నలరెడి వేశ్యా
మది రేక్షణల కసూయాపదయైన స్దినిఁ గాంచి వారందు రిటుల్. 164

సీ. వగలాఁడి క్రేగంట వలపులే పూఁచెనా
రవ్వలు నీలాలు రాశిపడును
ఎలనాగ కెమ్మోవి చిలిపిగా నవ్వెనా
ముత్యాలు పవడాలు ముసరుకొనును
జాణ యించుక పైఁట సవరించుకొనియెనా
పైఁడి వెండియు నింట బంతులాడు
పూఁబోఁడి పొలయల్క బొమముడుల్ గూర్చె నా
యెట్టి శ్రీమంతముం గట్టుపడును.

తే. ఔర ! యందాలపుట్టి నీ యనుఁగుఁబట్టి
కళలకుం బెట్టినదిపేరు కడమ మేము
దిగదుడుపు కక్కుఱకురాము దీనిముందు
దివ్వెటీకిక్రింద వెలుగాఱు దీపములము 165

గీ. రామభక్తుఁడై హనుమఁడు రాఁడదేల
మారభక్తుఁడై తలకిందు మాటిపోఁడె

రామ యను శబ్దమున కెందు రమణి యంచు
నర్థము వచింపఁడే శుకునంతవాఁడు ? 166

గీ. అనుచుఁ కులమువా రిట్లు నోరఱుగ దీనిఁ
బొగడ నేను స్వర్ణస్వప్నములను గంటి
ననుకొనిన దెల్లఁ దలక్రిందులయ్యె నిపుడు
పదిగ నగువారిమును జాఱిపడుటలయ్యె. 167

ఉ. పేరుప్రతిష్ఠలుంగల కుబేరులు బేరులు వచ్చి మెచ్చి బం
గారము నిల్వునంబొదుగఁగాఁగల మంచును నెల్లయాస్తి నీ
పేరిటఁ జేయువార మని వేలకువేలును గ్రుమ్మరించినన్
హారతులిచ్చినన్ బయిస నంటదు ముట్టదు వారిఁ జూడదే ! 168

క. మేళముబోవ్వుడమే యీవేళం గోటీశునింటఁ బెండ్లి యటన్నన్
గాళుల వ్రేళులఁ బడి బతిమాలినను ననేమి యొక్క మాటయు వినదే! 169

క. చదువుల సరస్వతివి భువి మదనునిరతి వీవు నవ్విమాటాడిన సం
పదలన్ని వద్దువద్దనఁ బదములఁ బడి రావె పొదముపదయనియనఁగన్. 170

క. 'ధనపుం బేరనిననె యింధనమై నిలువెల్ల మండుఁ దను వీఁక నేలా
వినిపించెద వామాటలు మును నిలువకు పొమ్మటంచు మోమటు త్రిప్పున్.

క. వెలయాలికినే వేళను గులసతిధర్మములు తడవఁగూడునె యనుచో
నులుకదు పలుకదు కందమ్ముల నశ్రులు గార్చు వ్రాల్చు మో మెత్తదిఁకన్.

ఉ. తాలుచుఁ దీవచేడియల తావులప్రోవులు తేనెసోనలై
వాలుగువాళు లందముగ నవ్వుచు రాలెడి పూలు యౌవన
శ్రీ లివి యేరికేనిఁ గయిసేయుము లాగు నిరర్థకమ్ముగాఁ
గాలమరుత్తు నీ ముడుపుగట్టిన యౌవనసౌరభమ్మనన్. 173

క. మీ రడిగెడి యర్థాలంకారమ్ములు తీరము లేను కాంక్షించునవో
సారస్వతాతురాలంకారము లీరెండు గూర్చు ఘనుఁ డెవ్వఁ డనున్. 174

క. సిరియును జతురాననసుందరియును సర్వజ్ఞసింగధరణీపతి నొ
క్కరుఁ దక్క వేఱొకని వీరిరువురు వరియింప రధిపుఁ డిది యొప్పఁడనన్.175

సీ. పంకేరుహమ్మయ్యుఁ బద్మమ్ము శుచియయి భానుచే వరియింపఁబడుట లేదె
మృగమదంబయ్యుఁ దావిగల మేల్కస్తూరి శ్రీ విష్ణుతిలకమై చెలఁగఁగాదె

కేకిలో నొక తోఁకయీఁకయై పుర వన్నె వెన్నుని తలనెక్కి వెలుఁగ లేదె
కీటనిర్గత తంతుకూట పీతాంబర మ్మల చక్రివసనమై యలర లేదె

తే. అసురవంశసంజాతుఁడౌ నిసుఁగు నెందు
నాత్మపదభక్తుఁ డంచు హృదంతరమున
నరయు సర్వజ్ఞుఁ డొక సింగమగుచు వచ్చి
రక్షసేయఁడె ? నాస్వామి రాఁడె ? యనును. 176

గీ. లక్షపతినైన వట్టి నిరక్షరాస్యుఁ
డీతఁ డని తేనెలో నీఁగరీతిఁ దీసి
వేయు లౌకిక మెఱుఁగదు స్వీయదృష్టి
నలరు విద్వాంసు నృపుఁ బెండ్లియాడుదునను.. 177

గీ. ఇంత విద్దె వచ్చి యెందు కక్కఱరా దిదొక్కనాఁడు రంగ మెక్క దనుచు
జాతివార లెల్లఁ జాటుకు నేటుకుఁ బరిహసింత్రు వట్టి పిఱికి దనుచు. 178

ఉ. అంతనె కూఁతుఁ గాంచి యిటులాడె గృహంపునెలంత యెందు నీ
వింతయె కానరాదు కులవృత్తిఁ దొలంగి చెలంగుమాత్ర మో
కాంత కులాంగనాయశముఁ గాంచుదె రోవెలఁదిం జనించి, మే
ల్కాంతులనీను రత్నమయి గ్రాలునె సానలదీరుకాచమున్. 179

చ. చలువలఁ బంచి పొల్గురియు చక్కని చిక్కని మోముగోముకున్
శిల కరఁగున్ లత న్వ్రేతల చిక్కుల స్రుక్కఁగఁజేయు వాన్ను మే
ల్కళ ననలీను మేను తెలికల్వల చెల్వము నేలు మీలును
న్వలఁ బడిపోవు నీ బెళుకువన్నెల చిన్నెల కన్నుసన్నలన్. 180

ఉ. అందఱు మెచ్చ సత్కళల నందియవేసిననేని రంభకే
నందని యందమున్నను పయస్సయి పొంగు వయస్సుగల్గనే
నందలమెక్కి యాడెడి మహత్తరమైన యదృష్ట మబ్బదే
నందని మ్రానిపండు నృపుఁ డట్టులు సాచఁగ నేల ! నర్తకి ? 181

చ. చెలియ ! నరేంద్రదర్శనము చేకురుటే కడు దుర్లభమ్ము నీ
తలఁచినయప్పు డొక్కెడలఁదానది చేకుఱునన్న ఱేనితోఁ
బలుకఁగ వేళచిక్క దొకపాటునఁ జిక్కినఁ బెక్కుకార్య మ
గ్నులు నృపు లౌర ! చిల్కపలుకుల్ చెవికెక్కునె తూర్యఘోషలన్? 182

గీ. ఎందరో సుందరులు వారి కేమి కొదువ
అందులో నీవొకతె వెవ్వ రడుగువారు
కడుపునిండిన హరికంటెఁ గమ్మమావి
ఫలము గానఁబడిన నేమి ఫలము చెలువ ? 183

క. వలచేని వలను బడి నివ్వలచు నృపుం డనిన నమ్మవలనుపడదు కే
వల మతని ప్రేమ మది తీవలఁ జిక్కిన మావిగున్నవలె నిలుచునొకో ! 184

శా. నీకన్న న్వగలాడినిం గనినచో నిన్వీడు నా కన్నియన్
వీఁకం గూడును ప్రేమ మేఁగువెనుక న్వీక్షింపఁ డప్పట్లఁగో
క్కోకంబుల్ వృథ లేమి జేయఁగల ఫ్వేన్గు న్వట్టి పల్లాఁపుదే
నాకుం జూడఁగ నీ కృతుల్ పెదవికన్న న్మించు దంతాకృతుల్. 185

సీ. అడుగు మోపక భూమి నరుగుచుందువుగాని యడుగక యెచ్చటి కరుగరాదు
నేత్రము ల్భూషలు నిధులు గాంచెదు గాని నేత్రాల వేఱొకనిఁ గనఁజనదు
అవరోధభవనాల నలరారెదవు గాని యవరోధ మొలయక యలరఁజనదు
భోగభాగ్యమ్ములఁ బొరలుచుందువు గాని భోగభాగ్యమ్ములఁ బొరలఁజనదు

గీ. నడుగులున్నను భూమిపై నడచుటకును
కన్నులున్నను జగమునుఁ గాంచుటకును
వీలొసంగని రాజసౌధాలలోని
బ్రిదుకు కై చచ్చిపడియుండు బ్రిదుకు బ్రిదుకె. 186

గీ. కావున న్వేరొకనిఁ జెల్వుకాని ధనదు
వలచి వలపించి బులిపించి వలయు సౌమ్ము
గడన చేయుమి యెలప్రాయ ముడుగు వెన్క
కుడిచి కూర్చుండి కాలమ్ముఁ గడపవచ్చు. 187

చ. అనవుడు దేవదాసిఁ గని యత్తరుణీమణి పల్కె నిట్టులో
వనరుహనేత్ర నావికటువ ల్వ్రిలిఖించెడి కన్నులంచు నా
ననమున చంద్రకాంతకళ నాట్యమొనర్చునటంచు మేను తీ
వెను దలపించునంచు నను వేరొక పూరుషుఁ గోరుమందువే. 188

సీ. హిమకరస్పర్శచేఁ [illegible] చందురా ఖద్యోతమును గాంచి కరఁగఁగలదె
ఓషధీపతిఁ గాంచి యు[illegible] క్రొందీవ యంచను గని పులకించఁగలదె

కుముదబాంధవ దర్శనమున నవ్వెడి కల్వ చంచలం గాంచి హసించఁగలదె
వరసుధాకరరుచు ల్మరగు చకోరమ్ము కరదీపికాకాంతిఁ గరఁగఁగలదె

గీ. చంద్రకాంతాననయు లతాచారుగాత్రి
కువలయదళాక్షి మృదుల చకోరహృదయ
రాజదర్శనస్పర్శనరక్తి లేమి
కరఁగి పులకించి తులకించి కాంచి నగునె ? 189

ఉ. అందని మ్రానటంచు నెద యందు నిరాశలఁ గుంది నిస్పృహన్
జెంది మహీరుహమ్ము దరిఁ జేరుట మానుకొనంగవచ్చునే
పొందుగ జాలవైచినను బూర్ణబలమ్మున గాలి వీచినన్
ముందర వచ్చి రాలిపడు మోదగతి న్భజియింపగాఁబడున్. 190

క. కలవాఁడైనం జాలునె చెలువుఁడు రసికుండుగామి జీవిత మేలా
చెలువలు కలువలు సరసుల చలువ వలన నిలువఁగలుగు జలజదళాక్షీ ! 191

చ. కళలకు శ్రీని మేల్వయసు గల్గినవాని ధనంపుఠేనిఁ జు
క్కల చెలికాని సంతత సుఖమ్ముల కిమ్మగు రాజధాని నిం
చుల విలుకానిఁబోని వరసుందరు సింగనభూమిజాని నే
వలచినదాని నన్నతఁడు వద్దన దేహమునేని వీడెదన్. 192

గీ. క్షుద్రమానవుతోఁ గూడు సుఖము కన్న రాజుఁ గూడు కష్టమ్మె గౌరవకరమ్ము
సమద జంగా విమిశ్ర దుగ్ధముల కన్న నమల గంగోదకమ్మె సుఖావహమ్ము.

ఆ. అనెడి తనయ నుడులు జనయిత్రి విని యోసి వెడ్డిదాన ప్రేమ గ్రుడ్డి దెందు
రాజు కల్మషాంతరంగమ్మునకు నద్దమేల విను మటంచు నిటు వచించు. 194

సీ. అమృత మొల్కించు దేవావతారం బన్న అల నిశాచరవృత్తిఁ జెలఁగుచుండు
చల్లని ప్రభువు దర్శన మొనర్తమటన్న నరి దర్శనము మాసమరుగ నొసఁగు
శీతలకరసమాశ్లేష మ్మొసఁగునన్న కఠినుఁడై విరహులఁ గష్టపెట్టు
తన వారి నిధుల వర్ధనముఁ గోరునటన్నఁ దమ్ములపై నరిత్వమ్ము జూపు

గీ. అందగారాని చుక్కల నాడుచుండు
నఖిల జగముల కధికారియై చరించు
విశ్వసింపఁడు ఛాయకు న్వెఱచుకొనును
చంచలుఁడు రా జతని నమ్ము జడులు గలరె ? 195

చ. గురువున కేని ద్రోహ మొనఁగూర్చుటకై మనమం దొకింతయున్
వెఱవఁడు రాజు రాజ్యపదవీ మదమత్తుఁడు వానిఁ గొల్చుటల్
పరవశవృత్తిగాదె సుఖపంజరబద్ధ శుకస్వరూపవై
యరు సెటు జెప్పు నీవు నటులాడవలెన్ బెరమాటలేటికిన్. 196

గీ. సరసభృంగసంగతి నున్న విరిపడంతి దేవతాసేవ కర్హమై తేజరిలదొ
దేవదాసిగాఁ బేరొంది దీప్తిఁ జెందఁ బరువుమాలిన దెట్లయ్యెఁ బడుపుఁగత్తె ?

సీ. దీనయా నొకని స్వాధీనయై యుండదు సతత సువాసినీస్థితిఁ జెలంగు
కులటయా నాత్మీయకులబహిష్కృత కాదు వంశ మర్యాదకు వన్నెఁగూర్చు
అబలయా నరుని దేహబలాప్తి నోడదు చిలిపినవ్వులఁ బరాజితు నొనర్చు
సభయలజ్జాస్యయా సభల నిందితయెగా దాటపాటల సమాజాదృతి గొను

గీ. సురలచే స్వర్గమందు నాదరముజెందు
శుభములకు ముందు భూపాల సభలయందు
హరిహరాదుల కనువిందు యజ్వపొందు
సానిదాని మించెడి దొరసాని గలదె. 198

గీ. దర్శనమున మత్తెక్కించు తరుణమదిర స్పర్శలేక వేధించెడి స్మరశరమ్ము
సకల ఋతువుల నలరు వసంతలక్ష్మి పవలురే ల్వెల్గు చంద్రబింబమ్ము వేశ్య.

క. కావున నాపలుకులు విని భూవిభునే వలతునసెడి మూఢ మతమ్మున్
బోవిడిచి స్వకులవృత్తిని సేవించి యశమ్ముగాంచి చెలఁగుమి తనయా : 200

మ. అనిపల్క న్జనయిత్రి కిట్టులను దీవ్రాసహ్యభావస్ఫురా
ననయై యాత్మజ కర్ణ శల్యములు నింద్యమ్ముల్ త్రపాహీనముల్
వినఁగాలేను ద్వదీయభాషణలు దేవీ! చాలు నీ ధర్మబో
ధనముల్ తల్లి విసంబువోయుననఁ బ్రత్యుత్తమ్ము లీజాతినే. 201

మ. మునుజన్మమ్ముల సేయరాని దురితమ్ము ల్జేసి నీర్వోసి పెం
చిన తత్పాపఫలమ్ములం గుడువఁగాఁ జేకూరె నీజన్మ వ్యా
ధుని ముం దేఁగి యహింస మానవున కెందు న్శ్రేష్ఠధర్మమ్మనన్
వినునే లోభిమనమ్ము లూసరము లుర్వి న్ధర్మబీజక్షతిన్. 202

మ. ధనమే ధర్మము కామ మయ్యదియె బంధప్రాప్తికి న్మోక్షమా
ధన మాత్మీయులు నాప్తబంధువులు మిత్రవ్రాతముల్ విత్తమే

ధనతృష్ణాంధులకు న్ధనేతరపదార్థంబైన ప్రేమార్థసా
ధనమైనట్టి మనమ్ము గానఁబడునే తన్మూలమే సర్వమున్. 203

శా. స్నేహాపేక్షల డాయుచున్ దనుమనశ్శ్రీ లర్పణల్ సేయుచున్
దేహంబై తనుఁగూడఁ నా విటుఁడు, దా దేహంబుగా మార దే
లోహంబందో విమోహమందు నెద యాలోచించు లోహంబొకో ?
దేహాకారముఁ బూను లోహమన నెంతే మెత్తనౌ క త్తియా. 204

మ. తగ నీహారతుషారధారలను ముక్తాహారముల్జేయ వీ
లగునే ధూమము నంబుదమ్మనుచు వర్షాపాత మేపారునా
నగదే లోకము శుక్తినిన్ రజతమన్నం గొట్టినన్ జిట్లదే
మొగమున్మాత్రము మార్చిచూపు వలపు న్మోహమ్మనన్ మోసమౌ. 205

చ. ఎద ననురాగ మా విటుపయి న్మనునంద్రు విడెంపుఁజెల్మితోఁ
బెదవుల పైనమాత్ర మగుపించును రాగము గాన మైత్రితో
నుదయముజెందు నెందు సరసోక్తుల సన్నని కూనరాగమా
యెద నలుమూలల న్వెదక నింతకు రాగమె లేదు పేరుకున్. 206

గీ. అంతరంగ పవిత్రత కందనట్టి పాత్రలో నుండు మలినజీవనము తాను
దేవతార్చన మొనరించు తీర్థమైనఁ గ్రోలువారికిఁ గీడుఁ జేకూర్చదొక్కొ !

సీ. సురనామమూని యసురకృత్యముల రేఁపి సేవించువారినిఁ జెరుపుచుండు
చనుచుండ నెవరేని గనుచుండిరో యని చోరునివలె గొంది దూరుచుండు
అతినీచపాత్రమై యాకర్షణ మొనర్చి సాంకర్యమునకు నాస్థాన మగును
నిస్సారమగునట్టి నీర్ కంటెఁ బలుచనఁ యగుచును మితిమీరి యెగసియాడు

గీ. స్వాదురూపాన మానససదన మంటి
ప్రమదడోలలఁ దేల్చుచు భ్రమల ముంచి
కలుగు సర్వస్వమును వెలిఁగ్రక్కఁజేయు
మధుఘట మ్మెందునేని సమ్మాన్యమగునె ? 208

గీ. విలువపీతాంబరము దాల్చు వేశ్యకంటె దినమొలం జరించెడి దొడ్డిపసులు మేలు
అతుల నైతికవృత్తు సంహతి నొనర్ప వేరుపురువని ప్రఖ్యాతి వేశ్యజాతి. 209

గీ. చెప్పకున్నను నరుదెంచు జెడుగుణములు
పట్టి బోధింప సుగుణము ల్పట్టువడవు

మట్టియంటును గుమ్మరిమనికిఁ జేర
పసిఁడి యంటునె కమసాలి వసతి కేఁగ ? 210

క. వేసటజనించెఁ ద్వదుపన్యాసమ్ముల వినుచు నింక నాతల్లి యనన్
దాసరస గద్దియంగల భూసురుఁ డిదిగాంచి మోదపూర్ణ హృదయుఁడై. 211

క. 'వెలవెలఁదుల జన్మించెడి పొలతియె యుమ్మెతలఁ దులసి మొక్క విధమునన్
మొలచెను స్త్రీరత్నం దుష్కులాదపి' యటంచు దాని స్తుతియించె నృపా !

తే. అద్విజుం డిప్డు మీదరి కరుఁగుదెంచి చనెడి యిరువురిలోనఁ బోతనసమాఖ్యుఁ
బరఁగువాఁడు శ్రీజానకీపతిని రేయి దర్శనమొనర్ప వచ్చె నాస్థానమునకు."

తే. అనుచు వేగరి పల్క నేమనుకొనియెనొ
భూవిభుని మోవి చిఱునవ్వుపూలు గురిసె
స్మితసుమాల నామోదమారుతము విరిసెఁ
జదలఁ దారకా ప్రణయిని శశినిఁ దఱిసె. 214

చ. వనభువి వీడి ఱేఁడు పరివారసమేతము రాజమందిర
మ్మునఁ జనెఁ జౌతిచంద్రుఁడు నభోగతి వీడెను నర్తకీమన
మ్మున విరహాంధత ల్వెనఁగె భూస్థలిఁ జీఁకటు లావరించె బా
ష్పనికర మోడ్చె భోగిని యివమ్ము స్రవించె దిశాముఖమ్ములన్. 215

గీ. తరుణిమం బేగ నెంతయు నరసి విరియు
వనితకురు లన్నియును దెల్లవాఱె ననఁగ
తరులు దిశలందు హిమగతిఁ గురిసి కురిసి
కరఁగిపోవు మేఘమ్మయి తరలసాగె. 216

గీ. చీఁకటింటికి తొలిసంధ్య చిచ్చుపెట్టె
నిప్పుకణమ్ములై కరఁగెను తారకాళి
పూఁత మెఱుఁగాఱు ముకురాలఁ బోలి దిశలు
వింతచెలువమ్ము దిద్దెను విశ్వపతికి. 217

తే. అల యుషస్సను తెరపటు మవలినుండి
కమలబాంధవుఁ డత్యంతకాంతు మెయిని
మంచుముత్యాల తలఁబ్రాలు ముంచి పోసె
సిగ్గు మైఁ బద్మినియు దరస్మితము గురియ. 218

సీ. అఱ్ఱు మోడిచి పొదుఁగంది నాకుచు నిల్చి
యంభారవళి లేఁగటావు లఱచుఁ
దలవె న్నొరగిడ్చి రెక్కల డాఁచి కన్మల్పు
ఖగతతుల్ కోమల నెగయుఁచుఁ గూయుఁ
దమపైనఁ గప్పిన తల్లిరెక్కలమధ్యఁ
దలెత్తి పిట్టపిల్లలవి యఱచు
నిలయాన నొరగాల నిల్చి కూర్కెడి పుంజు
కోయని మెడసాఁచి కూయసాగు

తే. నట్టి దేవతావేళమైనప్పు డడరి
సిగము దూలెడిగతి నూఁగుఁ జెట్లగుంపు
చల్లగాలి దొంతరలు దిగ్జలధు లందు
నలలుగొని స్వేచ్ఛగా నీఁదులాడుచుండె. 219

తే. మహిత దుర్గ సింహద్వార మంటపముల
లలితగతిని సన్నాయిమేళమ్ము లొకటఁ
బార్గిశాకీర్ణ రాగానఁ బార్సిఁగలిపి
హాయి భూపాలరాగాల నాలపించె. 220

చ. నగరికి వాఁకిటన్ ధణధణధ్వని మ్రోఁగె నగార మాగధుల్
పొగడుచు 'రావు సింగనృప భూషణ గండరగండ వైరిమ
త్తగజ నృకేసరీ ! సుకవితారసపూర్ణమహోదధీ ! యుదా
రగుణ సురద్రుమా ! బహుపరా' కని పాడిరి సుప్రభాతముల్. 221

ఉ. అంతనె కాల్యముల్ నెఱపి యంఘ్రుల పాదుక లూని ఱేఁడు శు
ద్ధాంతము వీడి వంది నివహమ్ము సభాస్థలి చేతులెత్తుచున్
బంతులు తీరి 'సింగమనృపా ! విజయీభవ' యంచుఁ బాడ సా
మంతులు మంత్రులున్ వినత మస్తకులై నిలువన్ స్మితాస్యుఁడై. 222

ఉ. వారిని వోలెఁ దక్కు పరివారముఁ గాంచుచు హస్త సంజ్ఞలన్
గూరుచొనంగఁ బంచి కవికోటికి నౌదల వంచి మ్రొక్కి ద
ర్బారును దీర్చి కూర్చొనియె బంగరుసింగపు గద్దెపైన సిం
గార్పుఁ జామరా లుభయకక్ష్యల నాడఁగ రాజహంసలై. 223

తే. అంత సభలోని కొకవృద్ధ యరుగుదెంచి
నృపునిఁ గని మ్రొక్కి సభికులు నివ్వెఱపడ
దివి గులుకు రంభకళలను దించివేయు
తనదు బిడ్డను జూపి యిట్లనుచుఁ బలికె. 224

శా. 'నిత్యంబైన ధనమ్ము సత్కళ యొకండే యంచు గీర్వాణ సా
హిత్యాభ్యాసము గానశాస్త్ర పటిమల్ హృద్యాంధ్ర వాగ్వశ్య పాం
డిత్యంబున్ జయదేవ గేయ సుమవాటీ చారు సంచారకృ
న్నృత్యోపేత మనోహరాభినయముల్ నేర్పించితిన్ దీనికిన్. 225

క. ప్రజ్ఞలు గావీ పలుకులు విజ్ఞులకే తెలియు విద్దె విలువ యనిన స
ర్వజ్ఞులు మీ ముందఱ నీ యజ్ఞ యిటులఁ దెల్పుటన మహా సాహసమా.

తే. కాని తెలిపినఁ ప్రభువు కీ కళల యందు
నెది మనమ్మున కత్యంతమిష్టమగునొ
యా కళా ప్రదర్శనమున కాజ్ఞ యిడెద
రనుచుఁ దెల్పితి దాసి క్షమార్హ' యనిన. 227

తే. తనను గూర్చి చెప్పెడి తన తల్లి పైనఁ
జాలు రెమ్మని బొమముడుల్ గ్రాల విసిగి
దృగ్యుగళి కాందిశీకమై దెసలఁ బర్వ
సిగ్గున నవరుచును దన చెంగు కొంగు 228

తే. ఇలఁ గళోపాసకుల కెందుఁ గలుగుఁ బ్రతిభ
దేనిలోనఁ దన్మయత వారూనఁగలరొ
యా కళలె దర్శనీయమ్ము' లని నృపాలుఁ
డామె మదికి నచ్చినది చేయనగునని యె. 229

క, అనఁగనె జయదేవాష్టపదిని గొని యొక కొంత సేపు తియ్యని భావా
భినయంబు నృత్యగతితో నొనరింప న్నిల్చెఁ దల్లి యొగి హంగు నిడన్. 230

గీ. చెక్కిచేసిన మోహినీ శిల్పమనఁగ దిద్దితీర్చిన నవరత్న దీపమనఁగ
పోతవోసిన యపరంజి బొమ్మయనఁగ అచ్చు మచ్చర యే యన నా లతాంగి.

ఉ. క్రొన్నన యంజలి న్వెలుఁగ గొమ్మరొయొ బొమ్మరొయొ యంచుఁ బ్రేక్షకుల్
సమ్మతి సేయ శ్లాఘపగొను చందము వేద్పడనీక యింతయున్

గన్నులు రెప్ప వేయకయె కాలును వ్రేలు గదల్చకుండఁ దా
నన్నరనాథుము న్నిలిచె నద్భుతమంది యతండు గాంచఁగన్. 232

చ. కదలెను పల్లవమ్ములనఁగా నధర మ్మదరెం బ్రకంపిత
మ్మొదవు లతాంతగుచ్ఛమన నొద్దిక నట్టిటు లూఁగె గ్రీవయున్
బ్రిదులు ప్రసూనయుగ్మమన వీక్షణము ల్చెళకాడె తీవియన్
వదలిన పూలజల్లన సభ న్వెదజల్లఁబడెన్ సుమాంజలుల్. 233

ఉ. కాళుల నందియల్ చిలిపి గజ్జెలు ఘల్లనె జల్లనెన్ మహీ
పాలుని మేను కెంజిగురు వాతెఱ నవ్వుల పూలు బూచె నా
లీల మరుండు మేల్మఖుమలీ యొఱలోపలి చంద్రహాసమున్
గేలను దూసె నద్ది గిలిగింతలు జేసె సభాసముద్రమున్. 234

ఉ. కసికొని తంబుఱా శ్రుతులఁ గమ్మని తుమ్మెద ఝుంకృతిధ్వనుల్
ముసరెను వేణువీణలను మూల్గెను గానకళావిలాసముల్
దెసల తధిమ్ తళాంగ్ త్రకిట ధిక్కిట ఝ్ఙాన్ తకధిమ్ తతెయ్యి మం
చెసగె మృదంగనాద మిటు లీఁగయు వ్రాలిన మ్రోఁగు మేల్నుతిన్. 235

చ. మిసిమి పసిండిమై తళుకు మించులు సంచలదంబరాంచలా
వసథము మాటుదాఁటి వెలివచ్చిపడం గను గుట్టునట్టి మే
ల్పసగల రంగురూపులకుఁ బమ్మయు రిమ్మగొనన్ త్రిభంగి మే
నెసఁగ నొయార మొల్కఁగ నరేశుని యాకృతిఁ గూర్చి మ్రొక్కెడెన్. 236

తే. సింగభూపాల! సుకవితా శ్రీవిలోల! వీరపరిపంథి శీర్ష కోటీర హీర
మణిమయూఖనీరాజిత మహితమసృణపాదపంకేరుహా! జయీాభవ! యటంచు

## ఆ ది తా ళ ము

తద్ది-తకతధిమితకిటతక ఝుంతా-జగతతోం గదిరిగుడు-తకరుంతా
దిరుగుడు ఝుంఝుం కిణజగణంత-జగణంతక-తగణంతక-తకరుంతక
తకఝుంతక-తకిణం-తకరుం-తకుందరి కిటతక-తరిత తరితధిమి
తధిమితకిడతకతకతా- తెహిధ త్తతా-ఓరాజా
రాజాధిరాజ సుర తేజా! సర్వజ్ఞ సింగనృపభోజా!
రసవాగ్వికచముఖాంభోజా! ఆశ్రిత కవికల్పకభూజా! పుంభారతీ! కరుణామతీ!
నరసింగా! శాత్రవమదతిమిరపతంగా! వాణీపద పరసిజభృంగా!
వనితాజన నయనానంగా! స్మరశరనిభరుచిరాపాంగా! మదవాక్పతీ! వాచస్పతీ

ఉ. వేదము లుద్ధరించి బలు వీఁపున నద్రి ధరించి కోరపై
మేదిని నుంచి దైత్యుఁ గసిమీర వధించి బలిం గలంచి భూ
పాదుల ద్రుంచి రావణు లయంబొనరించి హలమ్ము బూన్చి హిం
సాదుల మాన్చి మ్లేచ్ఛకుల హత్యఁ జరించు హరి న్నుతించెదన్. 239

త్రిపుటతాళము

తగ్గధింత తాంహత ధీనుత తద్దీనుత తాను ధణాంతరి
తఝుంతరిత తఝుంఝుంతరిత తఝుంతరిత ఝుంతక రేకిణ
తడికుడిడికుడిడిడికు డింకికు, తక్కిఁణనగ తకుందరి కిణనగ
తకుందరికుంద ధికుందరి తకుందక
జలధి నిహత వేదావనచణ విలసద్ఘననౌకాభకరణ!
ఖలసోమకదైత్య నిబర్హణ బలశోభిత మీనశరీరా!
మందరగిరికృత వరగోపుర సుందరతనుమందిర మహీధర
బృందారక సుధాప్రదాశ్రిత మందారా కూర్మాకారా!
పిశితాశనవధా కథాంచిత దశనాగ్ర విలగ్న మహీకృత
శశిమగ్న కళంక కళాధృత విశదాంగా వరాహరూపా!
కరభుజగనఖర దంష్ట్రావృత హిరణ్యకశిపు ప్రాణాశన
వరభక్త ప్రహ్లాదావన వరదా! నరహర్యవతారా!
బలిదత్త త్రిపదావని ధనవిలసిత విక్రాంత త్రిభువన!
బలిమస్తక ధృత పదపావనతల! శ్రీమద్వామనరూపా!
క్షత్రియ కులగోత్రవిఖండన సుత్రామ! పరశుపవిమండన!
శాత్రవ మదగర్వాంధతమసమిత్రా! శ్రీ భార్గవరామా!
దశదిక్పాలామర కామిత దశముఖ పశుబలి దాననిరత
నిశాట మదగజ కంఠీరవ! దశరథాత్మజా! రఘురామా!
లలిత శేషలావణ్యాజిరతులిత మసృణ ధవళ కళేబర!
జలధిసదృశ వరకృష్ణాంబర హలముసలధరా! బలరామా!
యాగస్థిత పశుహింసావల వేగాంతక కరుణాంబుధి జల
త్యాగాస్త్రవిజిత భవశృంఖల శ్రీగౌతమబుద్ధ శరీరా!
ఉరు యవన వనాగ్నిజ్వాలా! కరధృత భీకర కరవాలా!
వరదమత జగత్పరిపాలా! తురగస్థిత కల్క్యవతారా! 240

వ. అని దశావతార కథా విధానంబు నభినయించి. 241

చ. ముసిముసి నవ్వులా పెదవి మూలల దాఁగుడుమూఁతలాడఁగాఁ
బ్రసవమునొందె నందు నెలవంకలు చెంపకుఁ జేరలా కనుల్
గుసగుసలాడసాగెఁ జెవి కోనలతో నల సింగిణీ ల్బొమల్
గుసుమశరమ్ము లెక్కిడుచుఁ గోమలతన్ లతలై నటింపఁగన్. 242

చ. మసలె వయోరమా మధురమందిరదీప్తి నురోజయుగ్మమా
పసిఁడి పయోజషండములఁ బయ్యెద గాంగతరంగమాలికల్
విసఁరె దటిల్లతాప్రభలు వీరవిహార మొనర్చెఁ గౌనునన్
గొసరెను లోకలోచనచకోరము లా వదనేందుబింబమున్. 243

చ. పసరిక పట్టుచోలమున బాహువిలాసము లాటలాడఁగా
మసృణ మృణాలనాళ వనమాధురు లుర్విని బర్వెఁ దేఁటులన్
గసరుచు బారలౌ కురులఁ గట్టిన కీల్జడ నాల్గనాగమై
కసుబుసులాడె శ్రోణితటి గంతిడెఁ దంబుఱకాయ పొంకముల్. 244

ఆ. ఒడుపు నొదుగుఁ గల్గి కడు కోమలత నొప్పి యభినయించునట్టి యా లతాంగి
యొకొక యవయవమ్మె యొయ్యారముల నిధి కవనజలధి శిల్పకళల కవధి.

తే. చేయి మెదలుపఁ గానేమొ చెల్వుగుల్కుఁ
గాలుగదలుప నేమొ చక్కఁదనమొల్కు
గొంతువిప్పినఁ గోకిలల్ కొసరి పల్కుఁ
గొమ్మ చూపుల నింద్రజాలమ్ము సేయు. 246

తే. తమ్మిపూఁబొట్టలంబోలెఁ దళ్కులీను మట్టలన్ దమ్మిరేకులై మలఁగు వ్రేళ్ళ
నందచందము లెల్లఁ దా మణఁగి మణఁగి వంగిచెప్పిన ట్లాడుచు వరలుచుండె.

తే. త్రికరణసమన్వయత్వముఁ దేటపఱచు సాత్వికాంగికవాచిక సహజవృత్తి
భావరాగతాళాంచిత భరతనాట్య భంగిమలఁ జూపె నాహార్యసంగతిఁగొని.

సీ. హంసముఖాకృతి నలరించు నొకముద్ర
భ్రమరాకృతుల నొందు భ్రమను గొల్పు
హరిణముఖాకృతి యననొప్పునొకముద్రి
యెగయు పతాకమై యెసఁగు-నొకటి

శంఖచక్రాకృతుల్ సరిపోలు నొక ముద్రి
దర్పకబాణసంధాన ముద్ర
శిఖరాకృతుల నధిక్షేపించు నొక ముద్రి
యభయప్రదానహస్తాబ్జ మొకట

తే. ముకుళముద్రల భుజలతల్ మొగ్గదొడుగఁ
బూర్ణ వికసిత ముద్రిలఁ బూలుబూయు
వంపులగు వ్రేళ్ళఁ బూరేకు సొంపులీను
ఢీతిఁ గదలియాడు లత యీ నెలఁత యనంగ. 249

సీ. బేసరి కమ్మలు తీసినట్టులె వ్రేళ్ళ నొయ్యారముగఁ జీల లొలిచి పెట్టుఁ
చెరఁగంచు మని పంట గఱచి యద్దాని చాటున రైక విడిచినట్టులు నటించు
ముక్కుంజెవుల వ్రేళ్ళమూసి నీటమునింగి స్నాన మ్మొనర్చెడి సరణిఁ దెల్పు
నవతార దశకమ్ము నఱచేతిలో నాట్యమాడించు శివపూజ లభినయించుఁ.

తే. తానమాడుచున్నతటిఁ జెల్వుఁ దరుదెంచి చెట్టునెక్కి కాంచు గుట్టుదెలిసి
నగుచు నత్త వచ్చె దిగుమంచు జిగిమించు కళుకుఁ జూపుతోనె గదిమివైచు.

తే. పూలఁగోయుచు నొడిఁజేర్చి మాల గూర్చి
సరి నొనర్ప దారము పంటఁ గఱచికొనుచు
సిగనిడిన సూదిదారమ్ము స్మృతికిరాక
కుంచితభ్రూలతలఁ దల గోఁకికొనును. 251

తే. పూవుఁ దీవియపైఁ బ్రాకు భుజగు లనఁగఁ
గుడిభుజమునుండి కటి వ్రేళ్లు కురులనొడిచి
చ్ఛావు లోరఁద్రిప్పుచు జడచుంచులల్లు
మోడ్పుకన్గవన్ బ్రణయమ్ము మొగ్గదొడఁగ. 252

క. అద్దమున రాల్చు గుంకుమ ముద్దుగఁ దిలకము సవరిచి మురియును గనులన్
దిద్దిన కాటుక వ్రేల్ తల రుద్దును గురులొరయ నీటు రూపొందు కయిన్.

తే. ఒలుకు శ్రీగంధ మఱచేత నూర్చుకొనుట
అందముగ నీనెలను దీవి యాకుమడఁచు
భావముల హస్తవిన్యాస ఫణితిఁ జూపి
యచ్చెరువు గూర్చు గతుల నాట్యమ్ము సలిపె. 254

తే. సంయుతాసంయుతములగు సరసముద్రలందు సౌందర్యజగతి రూపందుచుండ
హస్తపాద విన్యాసాల హావభావ ప్రకటనలఁ జూచి ప్రజ చిత్రపటములైరి.

ఉత్కళిక (ద్విరదగతి రగడ)

జాలెవిడు బొంగరము లీల గిఱ్ఱునఁ దిరుగుఁ
బూలబంతింబోలెఁ దేలాడు నొక పరుగు
లాలించు పూలయూయేల చేరుల లాగు
నోలి ముందును వెనుక యొయ్యారముగఁ దూఁగు
నటునిటున్ విసరు ముత్యాలవీవనఁ బోలి
యటుసోలి యిటువ్రాలి యందాల నడఁదేలి
యలడోలికలఁ దేలు కలహంసగతి నేలి
మలకలగు నాగుకోమలి సొంపునడఁ గ్రాలి
చిలిపి యందెలు మ్రోఁగ వలయంపు గతిసాగఁ
బులకించి తనువెల్లఁ బూలబంతిగ రేఁగ
జోడు గన్గొని కుల్కి యాడు పారావతము
క్రీడాగతికి నడుగుజాడలిడ స్వాగతము
పాడు నాగస్వర ప్రస్తారమున నూఁగి
యాడు నొయ్యారంపు కోడెనాగన సాగి
వెస నిల్చి ఫణమెత్తి విప్పియాడెడి రంగు
కసుబుస్సులం గసరి కాటువేయు తెఱంగు
పాలేఱు లుప్పొంగి పాయవేసిన లీలఁ
బ్రాకులాడుచు మ్రోలఁ బరువులెత్తిన హేల
గిరుల దొరలుచు దూఁకి తరుల నొరసిన కరణి
వడులు పేనుచుఁ బారికి సుడులు దిరిగిన సరణి
మదమరాళము భాతి మత్తేభముల రీతిఁ
గొదమహంసల జాతి కదము ద్రొక్కు కపోతి
తకధిమిత తకఝుణుత తకఝుంతఝుంతరిత
తకిట జతి ప్రకటగతి నొకటొకటి జతపఱచి
కలికి మెయిదండ చెయి కదలికల వంపులవి
నలువైన నాగుగున్నల నడల సొంపులయి

కేలుదమ్ముల గరుచ్చాలనమ్ము లెసంగ
నేలపై రివ్వుమని వ్రాలు హంసి యనంగ
నాలీఢగతి నేలనాని కూర్చొని నాతి
కేల జుప్పునవంగి వ్రాలు మారుని చేతి
యుండీల చువ్వయై యూగాధ నెన్నడుము
కాండమిడునట్టు లాకర్ణాంత మిడుకరము
వెనువ్రాలి తనకాలి వెనువ్రేలి స్పృశియించి
మును వ్రాలి రతిపతికి మ్రొక్కి శిరమును వంచి
విడిన పయ్యెద కొసలు పిఱుచుట్టురాఁ జెక్కి
సడలు మువ్వలపేరు లెడనెడను ముడినొక్కి
యదరు చిఱుచెమ్మటల గడెగడెకు తడినద్ది
వడిఁ జిక్కువడు సరము లొడుపుగా సరిదిద్ది
గలుఘల్లుమని కాలి గజ్జియలు రవళింపఁ
దెలిచీరయంచు జలతారు ఝరి ప్రవహింపఁ
గురులు కనుదమ్ములన్ బెరసె బంభరములై
కర మొరసె బిగిచనుల్ కంతు బొంగరములై
ఫణులు గగనములోకిఁ బాఱాడెఁ గరములై
మఱుల జీవములు బడి పెనఁగు నుంగరములై
చెలినవ్వు నెలవంక చలువవెన్నెల గాయఁ
గలికి కన్నులు సొగసు కలువపూవులఁ బూయఁ
గులుకు గళరవములోఁ గొసరి కోకిల గూయ
వలరాజు పువ్వు క్రొవ్వాఁడి ముల్కులనేయ
వలలితాంగుళులన్ రసాలశిఖ పులకింప
వలరు తరుణాంగకము లామనుల తెర దింప
నొడలఁ బుత్తడినిగ్గు తడలు మత్తడి దూఁకఁ
బడఁతి కమసన్నలను నడచుఁ జెల్వపువాక
యాటపాటలలోన నందచందము నించి
యలరించి పళకు పళ నాడించి పాడించి
మురిపించి మఱపించి కరఁగించి కదలించి
ముదము నిచ్చుచు వచ్చె నిదురబుచ్చుచు మించి

లాలి నూఁపెడి శివాలాస్యమ్ములను బోల
బాలకృష్ణునిలీల భూలి తాండవపేల
నవ్యమోహినివోలె నాట్యముల వలపించె
భవ్యభారతివోలె భరతమ్ము నొనరించె. 256

క. అందము చిందులు ద్రొక్కను విందగు జవ్వనము భువనవిజయ మొనర్చెన్.
గుందనమున జీవము పడె చెందామర లుఱుకులాడె చెలి నృత్యములన్. 257

చ. లలిఁ బవడంపు వన్నెలఁ జెలంగు పదమ్ముల రాజహంసికా
చలన విలాస లాస్యములు సాగక గంగ మునుంగ బిఱ్ఱుగాఁ
గులుకు కపోతయానములు గుట్టలు చెట్టులు పట్టి పాఱఁగా
నలజడి చేసెనా గిలుకుటందెల చిందులతోఁ బసందుగన్. 258

సీ. పవనడోలికల జంపాల లూఁగుచు సరస్తటి నాడు కెరటాల సౌరుదోఁచఁ
గదను ద్రొక్కెడి మారు గజ్జెల గుజ్జుమై యాటలాడెడు బెడంగడర నొకట
నర్ధ మర్ధము ద్రిప్ప నసియాడు బాలార్కు కిరణంపుఁ దళుకుల సరణి బెళ్క
దంపతుల్ తమ ప్రణయంపుక్రీడలఁ జేత నెగిరించు పూబంతిసొగసు లొలయఁ

ఆ. గాళ్లెనాట్యమాడుఁ గదలదు పైకాయ
మెముకలేనియట్టు లెచటి కచటఁ
గలువకాఁడలట్లు కాళ్ళుచేతులు వ్రేళ్లు
మెడయు నడుము వింతయొడుపు మడఁగు. 259

తే. కొంకు మార్దంగికుని వైణికుని కరాల
వ్రేళ్ల నిరువదింటిని నిరుగాళ్ళతోనె
విషమములగుజాతుల మార్చి వివిధతాళ
కాలగతి తీవ్రతలఁ ద్రుటిన్ గట్టివైచు. 260

త-తో-హో-ధి-మ్మి-త్త-ధిం-ద-త-తో-హో-ధి-మ్మి-త్త-ధిం-దా
ధిత్తా-ధిమితా-కిటతక-తళంగు-తకధిమి- తకదధిగిణతోం
తత్తద్ధిమిత-ద్ధిమితద్ధికితక-తై తాకిటతక-తతెహితతోం
తై తాకిటతకతతెహితతోం- తేక్ ధినకిటతకధీన గినధాగీనధా కిటతక.

## ముక్తాయి - సంకీర్ణ

తకఝుం-తతఝుణ-తరికిణకిటతక-తరికిట కిటతకధా-తరికిట కిటతకధా-
తరికిటకిటతకధా.

ముక్తాయి - ఖండగతి

తఝ్ఝమ్-తకఝుం-తరితఝుం- × -తధిగిణత-తధిగిణత-తధిగిణత-

త్రిశ్రజాతి మార్పు

ధాగినధిగినత్రికిట ధాతధా త్రుకతకిట తకధాతధా-త్రుకతకిటతకధాత

రెండవకాలం ముక్తాయి

కిటతక-గదిగనదా-కిటతకగదిగనధా-కిటతకగదిగనధా

ఐదుజాతుల ముక్తాయి

తకఝుణ-కిటతక దధిగిణత-తకదధిగిణత-దధిగిణత-
ధిగిణత-గిణత-త-తో-హో-ధి-మ్మి-త్తధిం-ద-

తోహర

ముక్తాయిలఁగొని మృదంగనాదము ముమ్మాఱుల్ వడి మ్రోఁగెన్
సక్తాత్మకమై సభాసముద్రము స్మయవీచికలన్ దూఁగెన్
కాళ్ళగజ్జియలు ఘలుఘలుఘలుమని కర్ణామృతములఁ బోసెన్
జోళ్ళతాళముల పలపలపలధ్వని చూపఱఁ జకితులఁ జేసెన్
చేతికంకణాల్ గినగినగినమని చేతములకు వలవేసెన్
నాతి యందియల్ చనచనచనమని గీతములకు శ్రుతిబోసెన్
స్వర్ణమేఖలా కింకిణీక్వణిత ఝూణఝుణంకృతి బాడెన్
కర్ణపత్రి మణిమౌక్తికాభ్రమణ కాంతి తళత్తళలాడెన్
కనకరత్న వరతారహారముల కాంతులూయలల నూఁగెన్
ఘనతర నాసామౌక్తికప్రభల ఖద్యోతమ్ములు రేఁగెన్
వ్రేళ్ళ పమరు రత్నాంగుళీయరుచి వీచుల సింగిణు లూరెన్
గోళ్ళవెల్గు సితకాంతిపుంజముల క్షోణిని దారలు జాఱెన్ 261

"మంగళమహాశ్రీ" వృత్తమాలా (అనుకృతి)

ద్యోతలమునం దెగయు శ్వేతాభ్రమై మదను కేతనమ్మై యెగయుఁ గొంగు
పింజలై కెంజాయ సంజలై కెంజిగురు మంజరులఁ జిమ్మెడి చెఱంగు
జంభారివీటి గనిని యవతరించు దిగివచ్చు రంభఁ దలపించు రూపమ్ము
కరఁగి యుఱుకాడు బంగరు తేటనీటి నిర్ఝరి నేలు మేని వర్ణమ్ము

హాసమై చాంద్రీవికాసమై వికచసుమ భాసమై యొప్పు నగుమొగము
వీఁకమై కజ్జలితలోకనమ్ములనె రతి లేఖ లల్లెడి నయనయుగము
మూటయై వలరాజు తోఁటయై సోయగపుఁ గోటయై యొప్పు యౌవనము
కమ్మనై మదనమంత్రమ్మయై యింద్రజాల మ్మొలయు మధురభాషణము
సొమ్ములై పరిణయ సూత్రమ్ములై మరునాటబొమ్మలై నటియించు బొమలు
మ్రుచ్చులై సభకనుల నుచ్చులై నునుపట్టు కుచ్చులై చెదరు భ్రమరముల
మూకలై మిన్నేటివాఁకలై రాయంచ రాకలౌ కోకకుచ్చెళులు
నురువులను దరఁగలటు సరములౌ ముత్యాల నొరయుచుండిన యుదరవళులు
వేణువై నినదించు వీణయై వీణగొను వాణియై చిలుకు గానమ్ము
సంగీతసాహిత్య సౌందర్యసౌభాగ్య సకలమ్ము నామెదే సొమ్ము. 262

చ. సులలితరాగరక్తసిత శోభ లనంతము లీను నేత్రపుం
గలువ కనీనికాభ్రమత కాముకుఁ డాత్రమునన్ బయుంబడన్
గలియ నఁటంచు సిగ్గు నునుగాడ్పుల మున్వెనుకాడ నడ్డమై
నిలుపు స్వమోహసంతమస నిర్భరహస్తము లౌచుఁ బక్ష్మముల్. 263

తే. నాతిమోమున నాట్యమ్మొనర్చు కనుల
మదనవిజయధ్వజం బెత్తు మత్స్యయుగళి
రమ్యనవరసభావతరంగఝురుల
బెడిసి యాడెడి వజ్రాలు మిడిసిపడఁగ. 164

సీ. అరమోడ్పు కన్గవన్ బరవశత్వముఁ జూపు
కలికి క్రేఁగన్నులఁ గాంక్ష దెలుపు
నాలోలభీత ముగ్ధాలోకనమ్ముల
శృంగారలజ్జలఁ జిల్కరించు
సుడిగొన్న బొమముడిన్ జుఱజుఱ
చూచుచుఁ బ్రణయకోపభరమ్ము బ్రకటపఱచు
వాలుఁగన్ను లోఁకింతఁ దేలవైచిన చూపు
మనలేని విరహవేదనను జెప్పు

గీ. మాయు గనుదమ్ములన్ ధ్యానముద్ర గదుర
నగుకనులఁ బ్రియదర్శనానంద మెదుగ
నాతి నవరసభరితసౌందర్యఫణితిఁ
గంటి చూపుల కావ్యలేఖన మొనర్చె. 265

తే. కమ్మవిలుకాని యమ్ముల బ్జమ్ము లెందు
తమ్ములనఁబడుఁ గల్కి నేత్రమ్ములకును
మగువ వదన సౌందర్య రమా సమార్ధ్వా
నియతి మాసమ్మునకుతూఁగి నెలయగు శశి. 266

ఉ. ధారుణిపైఁ బదాబ్జములు తాఁకుచు నుండెనొ లేదొ యన్నటుల్
నారి ప్రసూనబాణు విలునారిగఁ దారచు నాట్యమాడెఁ జె
ల్వారెడు పండుటాకు నను జెక్కులఁ జెమ్మటచుక్కలొౌచు నొ
ప్పారెను ఫాలభాగమున నద్దిన కస్తురి చుక్క యట్టిటున్
గాఱెను ముంగురుల్ మొగముఁ గప్పుచు విప్పుచుఁ బోరెఁ జారు శృం
గార రసార్ణవమ్మునఁ జకాపిక చంచలనేత్ర మీనముల్
బాఱె నురోజయుగ్మములపై మనుపయ్యెద హద్దుపద్దులన్
మీఱెను గీల్జడన్ దుఱుము మేదుర సౌరభ సూనహారముల్
జాఱెను మూఁపునన్ బ్రజకు సమ్మదముల్ సమకూరె మానస
మ్మూఱె నృపాలరాణ్మణికి నుల్లమునం దిఁక నామె రూపమే
చేరె క్షణక్షణ మ్మపుడె చేడియఁ గూరిచి చిత్త మెట్టిటో
మాఱెను దెల్పఁజాలమికి మారుని దూఱెను సారెసారెకున్. 267

క. హే కేశవ! తవ విరహే సాకాంతా రాధికా విషణ్ణా యని తా
నా కామిని విరహ ప్రణయాకారము దాల్చి సెజ్జ నారాటపడున్. 268

ఆ. మోవి నొక్కికొనుచు మునిపంట బొమముడి
శిరము నూఁపి యెత్తు చిగురు కేల
పడి యొనర్పకంచు సంజ్ఞ సేయుచుఁ బ్రక్క
యింట నత్త వదినె యుంటఁ దెలుపు. 269

ఆ. అత్త నేదొ చప్పుడైనట్లు చెవి బెట్టు నటన సేసి సడి నొనర్పకుండ
నడచిపోయి 'కృష్ణ! నవనీతహార!' యని బుగ్గనులిమి కసిని బుద్ధిగఱపు.

ఆ. వెన్న దొంగిలించు చిన్నతనపుఁ జేష్ట మురళిఁబూని పాడు ముద్దురూపు
శంఖ చక్ర హస్త సర్వేశు వైఖరుల్ దలఁచి విరహ యగుచుఁ దల్లడిల్లు.

ఆ. ఈ ప్రపంచమన్న నేమొ సుంతెఱుఁగక
భయముఁ జెందు ముగ్ధభావ మొకటఁ

ప్రణయకోపభావప్రకటన మొనరించు
చిలిపిపిల్ల చేయు చేష్ట లోకట 272

ఆ. గోళ్లు గిల్లు మోవిఁగొఱుకును మునిపంట శిరముద్రాల్చి సిగ్గుజిలుక నిలుచుఁ
బయటఁ గొనలు వ్రేళ్లఁ బట్టుచుమెలివేయు హారమెత్తి కేల నటిటు బుడుకు.

ఆ కొంగుబట్టిలాగ గుంజుకొన్నతి 'విడుమబ్బ!' యనుచు విసుగునంది ద్రోయుఁ
'గానిలెమ్ము జ్ఞప్తిలో నుంచు'మని శిరమ్మూఁపి చూచు నోరచూపు లోకట.

ఆ. అన్నిదెసల బెదరినటు జూచి నోటిపైఁ జేయివైచి 'యబ్బ సిగ్గులేదు;
ఎవ్వరేని చూడ నేమందు' రని యెంతొ భీతిఁజూపుఁ గొన్నిరీతు లోకట.

ఆ. ప్రియుఁడు తొల్లిసేయు ప్రేమవిలాసముల్
తలఁచి తలఁచి నోట జలములూర
మత్తుకనుల మొల్కలెత్త స్మితమ్మమై
పులకరింపఁ దీపి కలలుగాంచు. 275

ఆ. చిన్నవోవ మోము చెక్కిటఁ గేలూని సోలు మేనఁ గండ్లు తేలవైచి
వట్టి పిచ్చిదానివలె నెందుఁ జూచినఁ నందె చూచు మౌనయౌచు నురక. 277

ఆ. ఎట్టులిడిన దేహ మట్టులె పడియుండ నిల్చిపోవు కనుల నీరు నిండ
నట్టె వదనమందు నుట్టిపడ నిరాశ నెడఁద బరువుదీర విడుచు నూర్పు. 278

ఆ. నటన నిజమొనర్చి నాతి కృష్ణుని విరహంపు రాధపాత్రి నభినయించె
నాటవెలఁది యొక్క యసమాన ప్రతిభకు మురిసిపోయి రాజు ముగ్ధుఁడయ్యె.

క. కురువృద్ధుండగు భీష్ముఁడు శరతల్పగుఁ డగుట బ్రహ్మచర్యత మనుటల్
స్మరశర దుర్భరధాటికి వెఱచియె కదె యనుచుఁ బొరలు విరితల్పమునన్.

క. చెలియా! స్మరశరముల కేన్ బలియగుచుండంగఁ జూడఁజాడియె నీకున్
వెలలేని పుణ్యమబ్బును జెలువున గూడుకొను దారిఁ జెప్పఁగదమ్మా! 281

సీ. మలయానిలుఁడె వీనిఁ జిలువ పొట్టంబెట్ట
రంయని నడుమంతరమున నాడుఁ
జందురుండఁట వీఁడు తయమొందుఁగాక
యీ మూర్ఖ చర్యలునాఁడె మొగులుముట్టె

మాధవుండఁట వీని మదమడంగనదేమొ
మ్రొక్కినకొలఁది కొమ్మెక్కి తూలుఁ
బూవిల్తుఁడఁట వీఁడు బుగ్గియైపోనేమి
యెఱుఁగని యటులుండి యేడిపించు

తే. తుంటవిల్తుదం డబలను నొంటిదానిఁ
బొంచి మొనగానితనము జూపించుకొనెడి
విభుఁడు రానిమ్ము చెప్పెద వీరియాట
లపుడు తలక్రిందులగును నా యాత్మ నగును. 282

తే. చలువచూపుల నగవు వెన్నెలలతోనె తగరము కళాయిపూఁతల జగతి రుద్దు
నీలిమబ్బులఁ దేలాడు బాలశశియొ పొగపొదలగ్రాలు మంటలచిగురుబోలు.

తే. హరి హరీ! చచ్చి బూడిదయైనఁగాని
మారహతకుని నైజమ్ము మారదాయె
దగ్ధమయ్యుఁ దా నితరుల తాప మెఱుఁగ
డేటికే యన నిజసఖి యిట్లు పలుకుః 284

మ. చెలి! పద్మానన! చంచలోత్పలదళాక్షీ! మల్లికాహాస! మం
జుల మాకంద మనోహర స్తబక వక్షోజా! ప్రవాళాధరీ!
అలినీలాలక! జాళువా చిలుక! పుష్పాస్త్రుండు నీతోడనే
బలియయ్యెంగదె వాని కేను బలినై వర్తింతునం చేడ్తువా? 285

క. చెలి నీ వలపులు చోద్యమ్ములుగదె! యివి మాకు నూత్నములుగా విపుడా
వలమురితాలుపు తానున్ వలరాజిడు వలను జిక్కి వలచు నవల నిన్ 286

తే. పవనుఁ డన్నను దవయయ్యపాన్పు తిండి
సోముఁడన మామ బడబాగ్ని సోదరుండు
మాధవుఁ డన నెయ్యుఁడు మధుమత్తుఁ డరయ
పచ్చవిల్తుఁడెట్టులగుఁ దాను లచ్చికొడుకు. 287

మ. కలధౌతద్యుతి నేలు కోమల లతాగాత్రిన్ మనోహారిణీ
తిలకన్ నూత్న వయస్కఁ గూడి యమునాతీరాన డోలల్లవం
గలతాకుంజకుటీవిహారియయి యా కంజాక్షుఁ డొప్పారుటల్
తెలిపెన్ నా కొకవార్త యిచ్చటికిఁ బోఁ దీరున్ భవత్కామనల్.' 288

ఆ. అనెడి చెలియ పలుకు విని రాధ ముదమంది కుసుమవిశిఖ తల్పవసతి వీడి
సకియ నీదు మేలు జన్మలో మఱతునె యనుచు యమునఁ జేరనరిగెఁ ద్వరగ.

తద్దిణాం ధిమితహాతఝంతరి-జంత జగదరి-జగందకుకుందరి-
కుకుంద తకుందరి తకుందకిణ ధిమితాం తెహిధ త్తతాం-కి ట్తకతా ననన్న
న తాజగంతరి-

### ఉత్కళిక - రగడ

పొన్నపువ్వువాసనల ప్రోవులు పొగడపూవుల నెగడు తావులు
మల్లియల మొల్లల సుగంధము నల్లగలువల చలువచందము
పిల్లగాడుపు టలలఁ దేలుచు నెల్లదెసలం దెగసియాడఁగనూ
చవుతి చంద్రుం డ స్తమించెను సంతమససంతతులు మించెను
గడలు వెన్నెల వలువలెల్లను ఘనమషీ పంకమున బులిమెను
ఖంజరీటము రెక్కసాఁచెను కజ్జలాద్రులు నిక్కిచూచెను
గటిక చీఁకటికురులు విడ దిక్ తటములందునఁ దాండవించెను
గన్నులం బొడిచికొనఁ గనఁబడకున్న శూన్య పథాంతరాళము
పర్విన్నకొనెనా దివిని జలముగ్ భ్రమరవాహిని సముదయంబులు.

ఆనిశీథిని ఫాలతలమున నలకలగు కాదంబినులలో
నీలవార్ధితరంగడోలలఁ దేలి తేపకు మిడిసిపడియెడి
మీను బిల్లల వోలె మిలమిల మిలుకు మిలుకు మిలుక్కు మనుచున్
గాలవల్మీకములు వెలువడి కసిబిసిగ వడి బెనఁగులాడెడి
త్రాఁచుపరువులవోలెఁ దళతళ తళుకు తళుకు తళుక్కు మనుచున్
చకచకచ్చకచక్కు మనుమను చంచలల్ నీలాంబరమ్ముల
నంచులై కనిపించి చనుటయు నవని చీఁకటు లావరించెనుగా.

ధరగిరులపై దాడి వెడలిన సురలరథములె యుఱుకులిడునో
వజ్రియే ఖండనమొనర్చునొ వడి గిరుల ఖండన మొనర్చునొ
గిరిశిఖరములె దొరలిపడునో కరులు ఘీంకృతిఁ గలియఁబడునో
ఢణఢణంఢణ ఢాణ ఢంఢఢా ఢఢఢఢ ఢఢఢఢ ఢాండ ఢమ్మని
గర్భనిర్భేదముగ నుఱుములు సార్భటింపగ నవని చెవుడువోవ;

రివ్వ్వమని యిటువైపు పాఱుచుఁ జివ్వ్వమని యటువైపు దూఁరుచు
నుర్వినంతయు నూఁపివైచుచు నుదధి జలముల లోఁపివైచుచు
రయ్యీమని వడి రవము సేయుచు కుయ్యీమని దివి గోలసేయుచు
రివురు రివురు రిరివురురివ్ రివ్‌రివ్ రిరివ్ రిరిరివ్ రిరివ్‌మను
వాయుదేవుని ప్రళయతాండవ వైభవములకు శివము దూలుచు
ఛరర రరరర ఛట్టు మనుచును దరులశాఖలు ధరణిఁ గూలఁగ
లతలు కుంజము లతుకు లన్నీ విడికుతలమందునఁ గూలిపడఁగా
హోరుమను ఝుంఝూనిలమ్ముల ఘోరుమను వర్షారవమ్ములు
రింజరింజరిరింజరిరిరింరింజరింజరిరుంరిఝం, అని
తెఱపినీయక చఱచికొట్టుచు కరకసంహతి విసరిపెట్టుచు
మూగి కురియు ఘనాఘనమ్ములు ముంచియెత్తె ధరం జలమ్ముల.
పాఱు యమునాతీరములలోఁ బద్మయుత కాసారములలోఁ
బల్వలాగత నీరములలో వార్యుతాశ్మాగారములలోఁ
జేరువలలో దూరములలో మంద్ర మధ్యమ తారములలో
రటటరట్రురరట్రి దుర్దుర పటురట ధ్వనిశబ్దములలో
వటువు వేదము వల్లెవేయునొ వరుణపతి జయభేరి మ్రోయునొ
తాకుఢెకణకుడేకు పూర్ణతటాకముల మండూకశబ్దములు
కిట్తకనగణనగణగనగణనగణగనగణనగణగనగం
కిట్తకజగజజగజగజగజజగజగజగజజగజగజగం
కిట్తకడెగడడెగడెగడెగడడెగడెగడెగడడెగడెగడెగం
తగనగణనగణగణగంతగజగజజగజగజగంతగడెగడడెగడెగడెగం
తగనగం, తగజగం, తగడెగం, నగం, జగం, డెగం - బహుగతి
నేకముఖముగ భేకలోకము వీఁకమై ఘోషింపఁగా.

అందు తానొక యందములగని నందనోద్యానంపు టామని
ఇందుధరు వలపించు మోహిని సుందరులకెల్లను శిరోమణి
కడుగఁబడియెడి కనకరథమనఁ గదలు మాణిక్యావసథమన
నంబరము మాఱైన చందురు బింబమో జలవీచిగత వికచాంబుజమొ ప్రియు వరచెలి చకోరఁబో యన నితరమ్ము మఱచును
ఏటికో యమునాతటీవని నేగునా వెశి నేమియో పని

మాటిమాటికి మాధవా యని మధురరుతములఁ బిల్చు నేరిని
తడియు వానకు జడియ దిరులకు దరువుతరువును దరియు నేలకొ
పొదపొదను గని వెదకు నేమియొ ఎద విసిగికొను నెవరు లేమియొ
విటపముంగొని ప్రియుని కేలని విడుచు వెంటనె మృదుత లేమిని
మధువొలుకు విరి నధర మనుకొని భ్రమనుగొని చుంబనమొనర్చును
వృంతమెడలి లతాంత మెడగా నెంతపనియయ్యో నని వగచును
వననికుంజము మాధవుం డని భ్రాంతి పరిరంభణ మొనర్చును
పొదలు శంపాకాంతిలోఁ గని పొదరు లివి యని వదలి యేడ్చును
పతిని బాసిన రతికుమారియొ భవుని వీడిన గాంగవారియొ
కాఁకబెట్టిన మరుకటారియొ కేకలిడియెడి వనమయూరియొ
హోరుమని ప్రవహించు యమునా చారురవ వీణాశ్రుతిం గొని
ప్రతిదిశం గని పిల్చునేరినిఁ బ్రతివచనముగ వచ్చు నా ధ్వని
ఓ దొరా! పిల్చునది యిది నీ రాధరా యనరాని ప్రణయపు
బాధరా దయనీయమీ నా గాథరా రారాదురా యనుఁ
బలుకరా! యీ దాసిపై నీ కలుకరా రాగామృతంబున్
జిలుకరా యెద పంజరపు నా చిలుక రారా చిలిపిమారా!
తరులు నిన్నే పిలుచు చూడుము గిరులు నీకై నిలిచి వేడును
ఝరులు నిన్గన నుఱుకులాడును ధరయె నీ స్వాగతముఁ బాడును
తరుల నీ సుందరతఁ గంటిని గిరుల నీ సుస్థిరతఁ గంటిని
ఝరులలో నీ కరుణఁ గంటిని ధర క్షమాగుణపరతఁ గంటిని
ఆదిమధ్యాంతరహితుఁడవని యాకసపు ముఖముననె వింటిని
అన్నియును నీవె యనికొననేనవ్యయుని నిన్గనకయుంటిని
దొంగ! నీవే దాఁగియుండ నెఱుంగ బ్రహ్మాతరమ్ము గాదుర
కలికి చూపులఁ గామితము లిడు కల్పవృక్షము పూలు బూయఁగ
చిలిపినవ్వుల సొగసు సురగవి చేఁపులై మధుసుధల గురియఁగ
రార! నవలావణ్య మదనాకార! సుమసుకుమారసుందర
నీరదాభ శరీర! నందకిశోర! శిఖిపింఛావచూడా!
నమ్ము నా దైవమ్ము యీ రూపమ్ము యౌవనమెల్ల నీదే
సొమ్మురా! నిను విడిచి యీ జీవమ్ము వమ్మగునిది నిజమ్మురా

త్రొక్కెదను నా దిక్కు నీవే యెక్కడికిఁ బోయెదను వద్దన
చక్కదనముల మూట రతిసుఖసౌరభపుఁ బూఁదోఁట రారా.

తనువు తనువుం బెనఁగి ప్రణయోద్యానవల్లిక లల్లుకొనఁగాఁ
గనులు కనులుం గలిసి మరువాసనల నీనెడి మల్లియలుగా
నురము నురమును గదిసి హృదయ మ్మొక్కటే యను మాటఁజాటఁగ
నధర మధర మ్మొఱసి యద్వైతానుభవ వల్లకుల మీటఁగ
మక్కువల యానందడోలిక లెక్కి మైమఱపెక్కి మత్తిలి
చొక్కుదమురా సోలుదమురా సుఖజలధిలోఁ దేలుదమురా.

పొరలు తరఁగలఁ గూడియాడెడి పూలమై విహరించుదమురా
పూలతావులఁ దేలు చల్లని గాలియై దివి నేలుదమురా
గాలితాఁకుల కరఁగి కురిసెడి నీలిమబ్బయి వ్రాలుదము న
న్నేల నిటురావేల రాధాలోల ! కనక సుచేల మృగమద
ఫాల ! స్మితదృగ్జాల ! ధృతవనమాల ! నా గోపాల కొనుమిదె
జోహారోప్రియ ! జోహారోసఖ ! జోహారులు వేజోహారుల్
తత్తక్కిట తక్కిట కిడతక ధిద్ధిక్కిట ధిక్కిట కిడతక
తొంగిడతక నంగిట కిడతక తతతధిగిణత
తతతధిగిణత
తతతధిగిణత 290

ఉ. చేతులు సాగ వ్రాల్గనులు చేష్టెడ మందత నావులించు నా
కూతముతో నొడ ల్విఱుచుకొంచు నురోజ భరోత్కటమ్ము నా
త్మేతరవస్తువాహ మటు లెయ్యెడనో పడవేయఁ దోఁచియు సాఁ
గోఁతవడు న్వడిన్ మొదలు గొట్టఁ జలించు లతాంగనాగణిన్. 291

చ. వలవల యేడ్చు వా డెచట వచ్చు నబద్ధము రాఁడటం చెదో
తలఁచుచు వెంటఁ జూచుఁ గనుదమ్ముల రెప్పలువేయఁ దూర్చి బి
ట్టులుకుఁ బయోజభారపృథులోరము కంపమునంద దోఁచదే
'చెలియ ! యిఁకేమి సేయవలెఁ జెప్పవదేమె' యనున్ మినున్ గనున్. 292

తే. 'అమ్మ ! రేపు వత్తునటంచు నమ్మబల్కి
మొగము ముందు ప్రేమము జూచ్చి మోసపోతి

నెన్నినాళ్ళాయెనే యితఁ డేఁగి' యనుచు
ముక్కుపై వ్రేలి నిడి మౌనముద్రఁ బూను. 293

క. సవ్య కరాంగుళు లొగి నపసవ్యపుఁ దర్జనిని మడఁచి స్వప్రియ విరహా
హ్నవ్యవధినెంచు నూహాకావ్యము లల్లును విషాదకంధి మునుంగున్. 294

సీ. బడిబడిం బఱతెంచు బాష్పస్రవంతిలోఁ
దెగిజాఱు మంచి ముత్తెముల పేరు
గాద్గద్య సందీప్త కంఠస్వనమ్ములో
దరిదట్టి పొరలు దుఃఖరస ఝురులు
రాగార్త బింబాధర స్పందనమ్ములోఁ
జిరుగాలిఁ గదలు కెంజిగురు గుదులు
రోమాంచ సముపేత కోమలాంగకములఁ
బ్రభవించుఁ బరువైన పద్మలతలు

గీ. కనెడి దంతయు నాపయి తనను దాను
మఱచియాడుచు నెంతొ యున్మాదదశను
వక్తయును శ్రోత తానెయై వదరుకొనుట
నడరు ప్రేమగీతాంత్యస్వరాలపనము. 295

ఉ. ఎచ్చటి నుండియో సుమధురేరిత వేణు సుధాతరంగముల్
వచ్చుచు నున్నయట్టు లటువైపు శ్రుతిం బచరించి ప్రాణముల్
వచ్చినయట్లు తోనె స్మితవైఖరి లేచి యదేదిశన్ గనుల్
విచ్చి కరమ్ము మాటుగొని వేమరు నట్టిటుఁ గాంచు గాంక్షమై. 296

తే. అదిగొ ! చెలి యిది యమునా తటాంచలమ్ము
నుండి వచ్చెడి నని చంక నొక ఘటమ్ము
నమరిచికొని నీటికని రాయంచ నడల
వెడలి యద్దరిఁ బాడు గోవిందుఁ గాంచి. 297

తే. గాయక శిరోమణీ ! పికాగ్రణి ! విశాల విమల యమునాతరంగిణీ వీచికలను
బంపు సందేశరూపక ప్రణయగీతి రాగవేగమ్మునకు గుండె లాఁగలేవు. 298

తే. కొమ్మతావులఁ గోయిల కూయుఁగాని
యా యెడారుల రాగమ్ము తీయఁబోదు

కొమ్మకోయిల విరహ దుఃఖమ్ము యమున
యేఱులై ప్రవహించు ముందెటు తరించు. 299

తే. కొమ్మ రాగము కరపల్లవమ్ము నూఁపెఁ
గోయిలం గల రాగమ్ముగొంతు విప్పె
నస్వతంత్రియా కొమ్మ తా నరుగలేమి
సిగ్గువిడి కోయిలయె తాను జేరవచ్చె. 300

తే. యమున నీటికై యీఘట మ్మరుగు దెంచి
నీదు రాగామృతమ్ముతో నిండిపోయె
దీని మోయఁగా నేను నాలోన లేను
వత్తువే దీని నెత్త నో వన్నెకాఁడ! 301

తే. నాదు మోహాంధకార పూర్ణ హృదయంబు
కరఁగి నల్లని యమునయై యుఱుకులాడు
దీనఁబడి కొట్టుకొనిపోవు దీన నేను
నీవెకావె యద్దరిఁ జేర్చు నావ వనఘ! 302

తే. ఇది యతడు విని ముదమంది యువలియొద్దుఁ
జేరవచ్చిన ట్లాతని చెంత కరిగి
రంగురూపులఁ గాంచి యారాత్రి యెవతె
యొద్దనో ప్రొద్దుబుచ్చిన ట్లూహసేయు.

సీ. 'ఎఱుపెక్కెఁ గనులు నిద్దురలేక యెవతెను
గూడియో' యనఁ గాదు 'వేఁడి' ననుచు
'గంట్లొనర్చెను నీదు కమ్రవాతెఱకు నే
చెలి' యనఁ 'గాదిది చలి' కటంచుఁ
'జెదరె నీ యందాల శిఖిపింఛ మేతన్వి
కేళినో' యనఁ 'గాదు గాలి' కనుచు
'నావపైఁ గాటుక వలువు లేకన్నుల
కలికివో' యన 'జాఱెఁ దిలక' ఘనుచు

తే. 'యాహి మాధవ' యనుచు నీర్ష్యమెయిఁబాడి
ప్రణయకోపాగ్నికీలయై పెనఁగులాడు

'అయి ప్రియే చారుశీలే !' యటంచుఁ గూడి
శాంత గంగాప్రవాహమై చాగి వేడు. 304

తే. రమణి ! నీయెదఁ బొంగారు సుమమనోజ్ఞ
హేమకలశవినిర్గత ప్రేమసుధలు
రమ్యమధురసమధురనారంగరుచులఁ
బైనఁ గొసరిడుఁ గోస్తనీఫలరుచు లని. 305

క. హరి ముగ్ధవధూ నికరే తరుణి విలాసిని విలసతి తత్కేళిపరే
పరిరంభణ చుంబన వర సురతవినోదే యటంచు సుదతి నటించున్. 306

సీ. చికిలి చూపులలోన శృంగారరసవల్లి పూలుపూయుచుఁ దోరణాలు గట్ట
చిలిపి లేనవ్వులఁ జెలువంపు వారాశి నెలబాలు లేఁతవెన్నెలల నలుక
కలికి భ్రూనర్తన స్లలితలావణ్యాభ్రములు నింద్రధనువుల మ్రుగ్గుదీర్చ
కులుకు గ్రీవాభంగముల సారె కొయ్యారముల వాఁక కంబు మంగళములీన

తే. నాతికలకంఠ రుతము సన్నాయిఁ బాడ
లజ్జ తెరపటమగుచు విలాసమీనఁ
బ్రణయ సితదృక్ప్రభలు తలఁబ్రాలువోయ
నారి నృపతి మనమ్ము లగ్న మ్మొనర్చె. 307

తే. మేల్కడాని క్రొమ్మించు నెమ్మేనితోడ
నలకళామహోదధి నీఁదులాడు నట్టి
వెలఁదిఁ గని మెచ్చి ముత్యాలవృష్టి గురిసెఁ
చెక్కులం జుక్కలై రాలు చెమటచినుకు. 308

చ. తిలకము మోమునం జెదరఁ దీవ్రిత ముక్కుపుటమ్ము లుబ్బి లో
వెలికి మితాధికమ్ములయి వ్రేఁగుగవచ్చుచుఁ బోవు నూర్పుగా
డ్పుల బిగియంతయున్ సడలి పొల్చెడి తమ్ములపాకు తీవయై
సొలసిన మేనితో నటిటు సోలెడి నెన్నడు మొప్పు నిల్చినన్. 309

తే. ఆమె సరసాభినయ చేష్ట లానృపాలు
తనువు మఱపించి నిశ్చేష్టితునిఁ బొనర్చె
నామె చలదపాంగ నిరీక్షణాతిశయము
నృపతిగని రెప్పవడని యనిమిషుఁడయ్యె. 310

క. మెఱయుచు నుండెఁ గన్నులు నరనిముసము వెన్కఁజూపి యాఁపిన యా బి
త్తరి బొమ్మచేష్ట లామెను గుఱించి మనమందు నెంతొ కొనియాడె నిటుల్.

శా. 'అమ్మో! ఎక్కడి కండ్లపండువగు నీయందాల రూప మ్మహో!
బొమ్మన్ దీర్చినయట్టు లున్నవి కనుల్ ముక్కు న్మొగం బద్దిరా!
సొమ్ముల్ దిద్దఁగ నా వయస్సున కిటుల్ జోడయ్యె నీయంగముల్!
సమ్మానార్హవు నీవ యౌవనమ! యీ స్థానాధివాసక్రియన్. 312

క. కుదురైన సఖి మనోహర
వదనము కుందనము కరఁగి పడి యచ్చున నే
ర్పొదవం బోఁతం బోసిరొ?
ముదిత యొడలిసొగసు శిల్పమున మలచిరొకో? 313

ఉ. అచ్చర మచ్చరంబు హతమార్పఁగఁజూచెడి యీమెఁ గాంచి ని
క్కచ్చిగ దీక్షఁబూను మొనగాఁడు పితామహుఁడైనఁ బిచ్చిగా
వచ్చును నందునన్ వయసువచ్చిన కొత్తదినమ్ము లివ్వి యీ
విచ్చెడి తమ్మిమొగ్గ తొలివిందున కే యళి పెట్టిపుట్టెనో? 314

ఉ. ముద్దియ సోగకన్గవకు మోహనరాగ కళా విలాసముల్
దిద్దెడి గీరు కాటుకల దిక్కయి తాళము వేయు రెప్ప లా
నిద్దపు క్రింది కందెరల నీలిమ లద్దెడి చిందు కాటుకన్
వద్దన ముద్దువచ్చెడిని వారిజనేత్రి మొగమ్ము దీనితో. 315

ఉ. జోక వయోవిలాస తనుశోభలఁ గాంచి వసింపనెంచి లేఁ
తాకులతో వసంతకళ నందు రసాలకిశోర మంచు పుం
స్కోకిల కొమ్మ మాటుగొని కూసెఁ 'గుహూ' యని గాత్రకిన్నరన్
వీఁక నమర్చికాక చెవి విందిడునే యిటు లన్యగీతికల్. 316

క. అలవ విటు తలఁచి మెచ్చుచు 'బలే బలే' యనుచుఁ 'గష్టపడి నేర్చె నహో!
యిలుగట్టెఁ గళ లిచట' నని పలుకు నృపతితోడ వృద్ధభామిని యనియెన్.

క. దేవా! నృపగిరి రాజ్యరమావల్లభ! విశ్వవిజయ మార్తాండ! కళా
భావజ! సర్వజ్ఞా! పుంభావ సరస్వతి! జోహారు నరసింగనృపా. 318

క. నాకూఁతురు గొప్పలు నే నేకరువిడఁగూడ దైన నేమో స్వామీ!
మీకారుణ్యము నాకిటు వాకుని[illegible] నా మనవి నవధరింపవలెన్. 319

గీ. ఏకవీందు్రఁగాంచినను మాయింటఁ బిలిచి
సింగభూపాల సముఖ విశేష మడిగి
యేఁగవలె నని యొకలెంపో రిడుచునుండెఁ
దమ కబద్ధ మీనుడి మాయెదకు నిజమ్ము. 320

గీ. తాము చెడి ప్రపంచమ్మునంతయునుఁ జెఱచు
ఘోరతర జారవృత్తినిఁ బాఱఁద్రోలి
పరిణయములాడి సత్కీర్తిఁ బడయుఁ డనుచు
సానిజాతిం బ్రబోధమ్ము సల్పునుడులు. 321

క. పలుకు' ననఁ జెలువ తనమది వలపు త్రపా జలధి మగ్న భాస్కరతఁ గొనన్
దెలిసెను జాలును మిక్కిలి పలుకకు మని జననిఁ గినిసి పలికి నృపాలున్. 322

క. నిజవదన రూపరేఖాంబుజ సుందరనేత్రి కుముదముల రాజకర
స్రజ మలమక ముఖవికసనము జరుగు నెట్లనెడి భావముల వీక్షించెన్. 323

క. అంతట శ్రీనాథుఁడు తత్కాంతను వీక్షించి యామె కన్నులలోనన్
గంతులిడెడి యాశయముల సొంతపు వాక్యముల నిట్లు సూచించెఁ దమిన్.

ఉ. 'వారనెలంతలందు నిటువంటి సుబుద్ధియు సత్యవర్తనల్
పేరున కేరి యొద్దఁ గనిపింప విల న్వెదఁబోసి చూడ నీ
వారిజనేత్రి పుట్టువు కవశ్యముగా నొక కౌశికుం డెదో
దారినిఁ దప్పి వచ్చి యిటఁ దా వ్రతభంగము నొందఁగావలెన్. 325

తే. ఈ నడత బుద్ధిగఱపెడి మానవులకు
నీమె నాట్యాభినయకళ లీ స్వరూప
మేకమై యెంతవానికి నెదఁ జెఱచెడి
నొడయుఁ డధికారియై తగ వుడుపవలెను'. 226

చ. అనుటయు ఱేఁడు రాగ దరహాస మనోజ్ఞ కటాక్ష పూర్ణ దృ
ష్టి నసిత షట్పదమ్ముల రచించి పొలంతి ముఖాబ్జసీమ వ్రా
ల్చినఁ గని మోసులెత్తు నునుసిగ్గున బిత్తరి వ్రాలుఁ జూపులం
దన తల వంచె నుచ్చులిడెఁ దన్నృప దృష్ట్యళికిన్ శిరోజముల్. 327

క. మదయౌవన ముబికింపఁగ నదయతఁ గంచుకము తలల నదుమఁగ బొరిఁ బ
య్యెద నడఁగెడి చనుగవగతి ముదిత ప్రణయత్రపల హాతిని మున్వొఫలకాడన్.

చ. నిజగళసీమ నాయకమణి ప్రభతో నగియాడు మౌక్తిక
స్రజమును గేలఁ గీల్చి తన సన్నిధి కాయమఁ జేరఁబిల్చి నీ
రజభవుఁ డా సరస్వతి కరగ్రహణమ్మొనరించు పట్లఁ గం
ఠజలజమందుఁ దాళి నిడుటంబలె నామె గళమ్మునం దిడెన్. 329

తే. ఱేఁడు భోగినిన్ సతిగాఁ బరిగ్రహించె
నచటి సభ రాజు రసికత నాత్మ మెచ్చె
నపుడు శ్రీనాథకవి తన యాశుధార
వర్ణనమొనర్చె వారి దాంపత్య మిట్లు. 330

క. 'వరవర్ణిని యీ సుందరి కర మరయ సుధాకరుండు కాంతుఁడు కళలం
దిరువురి సరసపుఁ గలయికఁ బరఁగెను రాగ మన సహజపద్ధతి గాదే.' 331

క. అన విని కవి పోతన యావనిత జననితోడ రాత్రి వల్కిన నీతుల్
మునువచ్చిమూర్తి గొనెనని యనుకొని జయదేవకృతుల నాత్మఁదలఁచుచున్.

సీ. కర్ణశుక్తి స్నిగ్ధ గర్భాశయాలనే కవిత పండించె ముక్తాఫలాలఁ
బద్మావతీ పాదపద్మలాస్యము కెద్ది రచియించె శృంగార రససరస్సు
కామేశు కోదండ 'కాండాలఁ దీయని పదనిడె నెద్ది స్వప్రణయ ఝురుల
సలలిత గోస్తనీ ఫల గుళుచ్ఛమ్ములఁ జిలికె నెయ్యది సుధాశీకరములఁ

గీ. జీవరఁ దలక్రిందు తపముఁ జేసియును నెవని
రమ్యతర వాగ్ఝరీధార రాధ యగుచు
గోపికానాథు ప్రణయమ్ము గుత్తగొనియె
నట్టి జయదేవకవివాణి యజునిరాణి. 333

సీ. రసభావ జలధిలోఁ గొసరి మున్కలువేసి దరిముట్టి జాతిరత్నాలు దెచ్చు
భాషార్ణవ క్షీరభాండమ్ము గిలకొట్టి పదనవనీతముల్ పంచిపెట్టు
నిహపర ఫలసార మెద చేఁపురాగ స్తన్యము జేసి కుడుపుఁ బ్రజాళి కడుపు
చెవి సోఁకినంతనె తవిలి చేతము నిగ్గు రతపాద మంజీర రవళిసేయు

గీ. సత్కవీ ! జయదేవ ! విశ్వమ్ము నీదు
మధుర మంజుల కావ్యకుమారి మహిత
పూజ్యపదముల పరప్రబుద్ధ ముగ్ధ
నయన పద్మాల నిడుకొని వడుపు నెపుడు. 334

తే. చేతములకుఁ జక్కిలింగితఁజేయ నీదు వాణి చిలిపి మాధవు క్వణద్వేణురవమొ
యుల్లములు కోమల రసాల పల్లవములుగాఁగఁ బులకించు విశ్వజగద్వితతికి.

తే. అట్టి నీకృష్ణ ప్రేమామృతాంబునిధుల
ననుభవించఁగాఁ దా నోఁచికొనినదేమొ
గీతగోవింద గాన కోకిలము గాఁగ
నవని పద్మావతియె యిట్టు లవతరించు. 336

తే. భోగమిండ్లలోపల నీమె పుట్టవలసి
నదియె కాదు శ్రీహరిభక్తి నటన యందుఁ
దాఁ గరఁగి యేడ్చి యేడ్పించెఁ దక్కునరుల
వ్రాయ దండకమగు నీమె వర్తనమని. 337

క. అనుకొని పోతన గంటమ్మును గొని యా నెలఁత సుగుణపుంజమ్ముల నా
యనుపమ సౌందర్యమ్మును ఘనవిద్యాపాటవమ్ము కనులన్ మెఱయన్. 338

ఉ. ముద్దులు మూటగట్టు పదముల్ జతగూర్చి సుధారసమ్ములో
నద్ది కడాని క్రొమ్మెఱుఁగు టద్దములో నవభావ వైఖరుల్
దిద్ది యలంకృతుల్ కొనలు దీరిచి పూచి ఫలించి వచ్చి తా
వద్దననేని పైకొనఁగ వ్రాసెను భోగిని దండక మ్మొగిన్. 339

శా. పాడ న్వ్రాసిన దండకమ్మది సభాభాగమ్మునన్ మంత్రమై
యేడాగోడము సేయుచు న్దొసఁగులే యూహించి యీర్ష్యాళురై
పీడంబెట్టు నఖర్వగర్వమతులౌ విజ్ఞాఖ్య భూతాళి నా
టాడించెన్ చెవిఁబట్టి చెప్పినటు వారాలించి యూఁకొట్టఁగన్. 340

ఉ. భోగిని యేరి సొత్తు కవిపోతన వ్రాసిన కావ్యమా మహా
భాగున కంకితమ్మయి సభాముఖమం దుపహార మిచ్చె నీ
త్యాగధనుల్ కవీశు నవతారము లేశుభకార్యమందుఁ దా
మేగరు రిక్తహస్తముల నీ మరియాదలు జాతినైజముల్. 341

క. అనవుఁడు నృపుఁ డా సత్కవిఁ
గనుఁగొని తద్రచిత మధుర కావ్యామృతమున్
గొనకొని పీనులఁ గ్రోలియుఁ
దన కంకితమిడుట నిటు కృతజ్ఞతఁ దెలుపున్. 342

సీ. ప్రకృతికాంతా స్వరూపంపు సొంపులఁ దీర్చి
దిద్ద నే యెద నిల్వుటద్దమయ్యె
మాటలతోనె బ్రహ్మాండమ్ము సృష్టింపఁ
గల మొనగాఁడేని గంట మరయఁ
దాను మాఱక యనంతస్వరూపాల్ జూపఁ
గల్గునే హస్తలాఘవపు జవము
తన వాక్కు లోకమంతయుఁ దలం దాల్పగాఁ
బలుకుబడిం గల్గి వెలయు నెవఁడు.

గీ. మధుర విజ్ఞానజలధిలో మనెడి రత్న
సంతతులె వాని హృదయకోశమ్ము సొమ్ము
శాశ్వతాక్షర సామ్రాజ్యసంస్థ కతఁడు
నిర్మకుట సార్వభౌముఁడై నెగడు సుకవి. 343

తే. అట్టి కవిరాజు సత్కృతినంది యైతి
నమరుఁ డను నేడి దెన్ని పుణ్యాల ఫలమొ
సత్కృతిని గొని సత్కృతి సలుపనెంతుఁ
జంద్రునకు నూలుపోఁగను చంద మొప్ప. 344

మ. అని వేనూటపదాఱులన్ బసిఁడి పళ్యంబందుఁ బోయించి పై
నను గాశ్మీరు పసిండిశాలువును విన్నాణంబుగా నుంచి చం
దన తాంబూల సుమస్రగంచిత సుగంధద్రవ్య సందోహమున్
గొని యాస్థాన కవీంద్రసంతతికిఁ గన్గొట్టన్ నృపాలుం డనున్. 345

చ. 'మఱఁగఁగఁ జేసె నో కవికుమారక! తావక భావపూర్ణ వా
గ్విరచిత దండకంబు చెవి విందిడి మందిడిన ట్లమర్త్యయై
పరఁగెను దాన మత్ప్రియభాగిని భోగిని దాఁగి సత్కవీ
శ్వర రసవాక్ప్రపంచ వినివాసము నాశమెఱుంగ దెయ్యెడన్. 346

శా. వేయిన్నూటపదాఱులన్న నొక విత్వే నీకు నో పోతనా
ర్యా! యాస్థానకవీంద్ర సంతతికి నీపద్యామృత న్వెల్గఁగా
నీ యుద్యానము లీ గజాశ్వవిభవం బీరాజ హర్మ్యాంచిత
శ్రీ యాత్మీయధనాళి నన్నుఁ జెలి విన్ సేవించు నశ్రాంతమున్.' 347

ఉ. చందన చర్చతో నృప ప్రసన్నమృదూక్తులు చర్చచేసి గె
ల్పొందఁ గవీంద్రు మానసమహోద్విపయిం బయిరీతి, వక్షమం
దందము చిందులాడ సుమహారము లా కవిరాజు మానసా
నందపుఁ గాళ్ళ బందమిడి నర్మిలి నాఁప మహీపుఁ డంతటన్. 348

ఉ. శాలువ కేలఁ బూని కవిచంద్రుని గప్పి బహూకరింపఁ బో
'నేల యివన్ని నాకు లభియించెను మీ మృదువాణి నెప్డొ నేఁ
జాల భవత్కవీంద్ర పరిషద్గురుపీఠి నలంకరింపఁ గాఁ
జాలు' నటంచుఁ బోతనయె క్ష్మాపతి కేలును బట్టి యిట్లనున్. 349

ఆ. 'ఈ కవీంద్రు జన్మ మీశ్వరునికె దక్క నొరుల కెప్డు చేతులొగ్గి యడుగ
ఆఁడుబిడ్డ దేహ మమ్ముకొనెడునట్లు కృతుల నమ్ముకొనుటె బ్రతుకుదెరువు?

సీ. ఒరుల రాజ్యాన మే ముండువారముగాము ఏలగాఁ బదములు చాలగలవు
ఒకరి ప్రభుత్వాన నొదిఁగియుండము మేము గురు లఘు గణ పాలకులముగాన
అన్నవస్త్రాలకై యాచింప మన్యుల నవరసామృత భోజనమిడఁగలము
అర్థార్జనమ్ముకై యర్థింప మొరుల సకల విధార్థాలంకృతు లిడఁగలము.

గీ. స్వీయ తాళపత్రకుటీర సీమలందు
నఖిల భూతకోటికి నమరాశ్రయమిడి
శాశ్వతము బ్రోచు సత్కవీశ్వరుల మేము
దైన్యమునఁ బడియుండ మితర గృహాల. 351

తే. వికచ చంపకోత్పల వనవీథులందు మత్తకోకిలములు పాడు మధురగతుల
నాటవెలఁదులు మా యొద్ద నాడు చంద్రు సంచరింతుము మత్తేభసమితిపైన.'

క. ఇటులనెఁ బోతన కవివరుఁ డటఁగల పండితుల గుండె లవియఁగ స్వైర
స్తటములఁ గేలిడి 'భళి! నీ దిటవుకె మ్రొక్కవలె'నని స్తుతించిరి సభికుల్. 353

ఉ. వెంటనె పార్థివుండు కవివీరుని ధీరత గాంచి నవ్వి 'మీ
వంటి కవీంద్రు లిమ్మహి నెవారును లేరిక మీరె గుత్తగాఁ
గొంటిరి సత్కవిస్ఫురదకుంఠిత నిర్మల ధర్మకీర్తుల
న్నింటిని కంటికాంచిన మనీషులు శేషులు మీరె వాణికిన్.' 354

క. అని పరిషత్కార్యక్రమమును బాహ్యము మఱచి మురిసి ముగియించి కవీం
ద్రుని శ్రీనాథునిఁ బోతన ననిపె నిజారామవసతి కాదర మొప్పన్. 355

క. వారు నృపాలవినిర్మిత సారతర సుఖాన్నపాన శయనాదిక స
త్కారముఁ గొని సాయం సంచారమ్మును సలుప వనిని జరియింత్రు తమిన్.

మ. హసదత్యంత మనోజ్ఞ పుష్పయుత దివ్యారామ సీమాంతర
స్థ సరోపాంత సితద్యుతిప్రకర భాస్వచ్ఛంద్రకాంతోపల
ప్రస్రుతాపూర్వవిలాస కుట్టిమ ధరాభాగమ్ములం బోతనా
ర్య సనాథుండయి వన్యశోభఁ గనులారం గాంచు శ్రీనాథుఁడున్. 357

చ. లలిత లతాంబరోడుగణలక్షిత సుందరకుంద పుష్ప గం
ధిలకరశాఖయై యొసఁగు ధీరసమీర కుమారు స్వాగత
మ్ములఁ గొని కూర్మి నూర్మిచయపోతములన్ సరసీ ప్రసూత శీ
తల పవమానడోలికలఁ దన్పుచుఁ బాడెడి జోలల న్వినున్. 358

చ. కిలకిల నవ్వుపూలఁ బరికించుటచే వికసించు మోములన్
గలరవ భావగీతికల గానమొనర్చు శకుంత జాతి గం
తులఁ గని నాట్యమాడు మదితో నలనల్లన గాలిఁదూలు దీ
వలఁ దిలకించి యందు తనువల్లికలన్ గవిరాజు లుండఁగన్. 359

ఉ. అందొక పిప్పలీతరు వరాగ్రకులాయతలమ్మునందు లే
కందువు లార్ద్రచుంచువు ముఖమ్ముల విప్పి కలస్వనంబులన్
సందడిసేయ మాతృ ఖగశారిక మేఁతను నోట వెట్టు క
న్విందిడు దృశ్యమొండు కవివీరుఁడు పోతనఁ గాంచి యిట్లనున్. 360

గీ. 'ఈ పులుంగు నిసుంగు లాయెల లోసంగు
జనని కేమి ప్రత్యుపకృతి సలుపఁగలవు
ప్రతిఫలముఁ గోరకయె మాతృపతగి వీని
నేల పోషించునో యాత్మ నేమి దెలియు. 361

సీ. చెమట ముత్తెముల రాశిం బోసినదె కాక ప్రభు సన్నిధులు భృత్యువశముగావు
దన జీవనమ్మంత ధారవోసినఁ గాక భార్యాప్రణయ వృక్షఫలమమరదు
వింబారగింపుల వెందుఁ జేసినఁ గాక సఖ్యదేవత సుప్రసన్న గాదు
హృదయాబ్జముం దమిన్ బదముల నిడఁగాక శార్ఙ్గి కారుణ్యాప్తి సాధ్యపడదు.

గీ. కన నపోతుక ప్రేమ గంగా ప్రవాహి
మాతృమానస స్వర్గధామమ్ము నుండి

స్తన హిమాలయ శిఖరమూర్ధములు దాఁటి
తడిపి చను శిశుతరుమూలతర్ష మడఁగ. 362

సీ. స్వప్రాణయార్థ సర్వస్వమ్ము వెలనిచ్చి
నను గొంచు గర్భమున నిడి దాచి
తన పుత్రుఁ డనిపించుకొనుట కింతకు నాదు
తనువుకై రక్తమ్ము ధారవోసి
యదలు నెక్కడనో గర్భాందోళికామధ్య
నాకని రాయంచ నడఁ జరించి
క్రొత్తచుట్టము ననుకొనుచు నల్పాహార
ములఁ దన్ప రుచులు కోర్కులని కుడిచి

గీ. తివిరి దశమాసముల దశేంద్రియ విశిష్ట
మైహికాముష్మికానుభవాతియోగ్య
మైన యీ మేను తనదు గర్భాంతరమునఁ
దీర్చి యిడు తల్లిఋణ మీఁగు తెరువు గలదె? 363

ఉ. బమ్మనుగన్న గర్భమ్మృదుపద్మము విష్ణువు గూర్కు పాలసం
ద్రమ్మును రుద్రు నెత్తికొని రంజిలఁజేయు హిమాద్రి మాతృవ
క్షమ్మను నందనోపవన కల్పిత పుష్పఫలాదికమ్ములై
యమ్మను మించు దైవ మిలయందు మఱెందునులేదు లేదనున్. 364

ఉ. తొమ్మిదిమాసముల్ మమతతోడుత మోసియుఁ గాంచి యీఁగనున్
నమ్మక కంటఁ గన్నిడుచు నన్నొలకంగొని యంతనింతగా
నెమ్మది పెంపుఁజేసి యల నిద్దురఁగోరిన నేని నాదు సే
మమ్మకు నవ్వుచున్ దృణసమమ్ముగఁ బ్రాణములిత్తు నేననున్.

చ. కలకలలాడు నానగు మొగమ్మున మొగ్గలు విచ్చఁ గేకలం
గలరుతిసేయఁ గోయిలదుగల్ మృదులాస్యమొనర్పఁ గాళ్లు సే
తులు నగి కాంచి యుగ్గనుచుఁ దొట్టియ చిల్కకుఁ బాఠమిచ్చు నా
తొలిగురువైన తల్లికిడ దోసిట నిండవు మూఁడులోకముల్. 366

సీ. నాతల్లి మేల్జవ్వనంపుఁ గొప్రింజిగిచాయ
చిగిరించె నా కాలుసేతులందు
నాయమ్మ హృదయ ప్రణయసూనవాసనల్
ఫలియించె నా ముద్దులొలుకు మేన

నాయంబ సత్రపానయనకోరకములు
వికసించు నా నవ్వు మొకములోన
నామాత రూపలతామంజుబింబముల్
దాఁగురింతాడు నా తనువులోనఁ

గీ. తల్లి సరసవాఙ్మధురగీతములయందు నాదు కలరుతమ్ములు మోహనస్వరాలు
జనని రాయంచనడల లాస్యముల నాదుతప్పటడుగుల లయలాదితాళగతులు·

తే. నాదు జీవనసరసి యున్నంతవఱకు
మాతకనుదమ్ములకు వాడు మాటలేదు
నా కెదేన్ రోగపున్నీడ సోఁక నాపె
నగు మొగము చంద్రునకు గ్రహణమ్ముపట్టు. 368

తే. నేను జేసిన దామె కింతేని లేదు ఆమె చేయని మేలొక్కటైనలేదు
ఆమె రక్తాలఁ బీల్చితి నాఁకలియని యన్నమున్నీళ్ళనదు నన్నుగన్ననాపె.'

క. అనుకొనెడు పోతనార్యుని వెనుక నెవరొ నడచినట్లు వినఁబడెఁదోడ్తో
వెనుదిరిగిచూచె సత్కవి మనుజుం డొకఁ డేగుదెంచె మది శంకింపన్. 370

క. ఉత్తర సుకకేలం గొని తత్తఱమున వచ్చి యచటి దౌవారికుఁడున్
దత్తావధానులగు కవిసత్తములను గాంచి వినతిసల్పి నిటువలెన్. 371

మ. ఒక వార్తాహరుఁ డేఁగుదెంచి భవదీయోదంతమున్ బృచ్ఛ సే
పి కడున్ వేగ మొసంగుఁడంచు నిదె యిచ్చెన్ లేఖ నొక్కండు తా
మొ కటాక్షించుఁ డటంచుఁ గైనిడి నమన్మూర్ధస్థ బద్ధాంజలి
ప్రకటత్పాణిపుటప్రదీప్తుఁడయి నిల్వంగాంచి శ్రీనాథుఁడున్. 372

తే. ఆతఁ డొసఁగిన యాజాబు నంది కేలఁ
ద్వరగ విప్పి తా నిటు పఠింపందొడంగె
'నమఁ జిరజీవిఁ బోతవ నగ్రజుండు
మంగళాశీస్సులిడి వ్రాయు మాటెది యన. 373

తే. పదిదినము లేఁగినవి జ్వరబాధతోడ నమ్మగారికి నోట నీరైనఁబోదు
కలవరించును రేయింబగల్లు నిన్ను కనులఁజూపు చిక్కుట చాల కష్టమెసుమి.

తే. కావునం జాబుఁగన్న తత్క్షణము నీవు
బయలుదేఱు మాలస్య మింతయుచలుపక'

యనుచు నీలేఖ నిట్లు విన్నంతలోనె
యస్త్రశస్త్రముల్ గ్రుంగెఁ బోతన్న కపుడు. 375

తే. వనముఁ గల దల్లె పోతన తనువుఁ గలదు
పూలుఁ గనరావు వినరావు పుల్గు రొదలు
సంక్షుభిత జీవనాంచిత సరసియందు
లోకబింబము లుండియు లుప్తములగు. 376

తే. తనదు నవ్వు వెన్నెలలలో దశదిశలును
గళలనీనుచు శోభగాఁ గానుపించుఁ
దనదు కన్నీటిజలధుల దశదిశలును
మునిఁగి కనరావు ప్రళయమ్ము మూఁగినట్లు. 377

క. మున్నున్న సంతసము తాఁ గన్నీటంగడుగఁబడుటఁ గళ లుడిగె మొగం
బన్నము నీళ్ళన కాతఁడు విన్నదివిన్నట్లు లేచి వెడలఁదొడంగన్. 378

శా. శ్రీనాథుండునుఁ బోతనార్యుఁ గని యుర్వీనాథు సాన్నిధ్యమం
దే నీవార్త వచించి సత్వరము నీ వేఁగన్ జవాశ్వోల్లస
ద్యానమ్మొం డనుకూల మొందునటులన్ యత్నింతునంచు న్నృపున్
గానంబోయెను బోతరాజు వల దక్షంబంచు వారించినన్. 379

చ. చనినక్షణమ్ములో మగుడఁ జయ్యనఁ దా నరుదెంచె నాతఁడ
వ్వనికి నృపుండొనర్చిన యవజ్ఞను జెప్పకచెప్పు చిన్నవో
యిన మొగమొప్పఁ బోతనయు నేమటుగాంచె దహో ఫలించెనే
పని యన వచ్చునట్టి పని వాకిటఁ దీక్ష నటంచుఁ బల్కుచున్. 380

క. సిరినాథుఁడు దుర్భరగతి నెఱి మర్మమ్ములఁ జెకల్చు నిష్ఠుర వాక్కుల్
నరపాలుఁడు పోతన కవివరుఁగూర్చి వచించినట్లు వాక్రుచ్చె నిటుల్. 381

మ. అరుగంబాను కవీంద్రచంద్రులకు మాయశ్వంబు లేపాటి వ
క్షరసర్వార్థవిధాత లాఢ్యకవితా సామ్రాజ్య మత్తేభముల్
కఱవే వారికి భుక్తియుక్తినిడు శ్రీ కామారికే దక్క య
క్కఱకై వారు కరంబు సాచుదురె రిక్తక్ష్మాపతి శ్రేణికిన్. 382

చ. అరయఁగ భూజరాజ మదియై భువి రాల్చు ఫలమ్ము లెంతయున్
సరసములై సమగ్రమగు స్వాదురుచుల్ జిలికించు నర్థితోఁ

బరువపు జూల రాల్చిన యపక్వఫలమ్ము లభక్షణార్హమై
కొఱకి త్యజింపఁగాఁబడుచుఁ గూర్చు నతృప్తి నెడంద నెందునున్. 383

చ. అనుచు వచించి మౌన పరిహాస విభాసితుఁడై నృపుండు న
గ్గనె నని పల్కు శ్యాలకునిఁ గన్గొని పోతన వీతిహోత్రుఁడై
చనుమనినార లెవ్వ రిటు చల్లని వార్తను నాదు పాలికిం
గొని చనుదెంతువంచు ననుకొన్న దెవారని మాఱుపల్కుటల్. 384

చ. అరుణ సరోజరాజిఁ పరిహాస మొనర్చెడి నేత్రసీమలన్
మెఱసెను వీరభార్గవి తృణీకృత విశ్వవిభూతి వైభవ
స్ఫురణఁ దలిర్ప స్వేచ్ఛ మినుఁ జూచెడి గుర్వభిమానకేతువున్
గరమునఁ బూని ఱేని పృథుగర్వమతిన్ గబళించునో యనన్. 385

క. అంతటఁ బోతనయును భూకాంతుని యవమతిని శివుఁడు గరళమ్మునటు
ల్స్వాంతగతి మ్రింగి చింతాక్రాంత స్వాంతమున జననిఁ గనఁబోవుతఱిన్. 386

గీ. అపుడు శ్రీనాథుఁడును బోతనార్యు ననుప
నూర్వెలికివచ్చి యింక నేనుందుననుట
వెదురులుం గ్రొత్తకుండలు నెదురువచ్చె
నైన నోరాడదయ్యెఁ బోతన్న నాఁప. 387

క. ఆ వెదురుకట్టె గణుపుల ప్రోవెంచెడి నెవని బ్రదుకు ముగియుదినము లి
ట్లే విగతాత్ముఁడు చితిపైఁ బోవఁగ నిచ్చెనల వైవఁ బోడువెదిగెనొకో.

క. ఈ నూత్న రిక్త ఘట మే మానవ జీవన పిపాస మసల వివృత ఘో
రాననము గలిగి యీగతిఁ దా నెదురయ్యె ననుకొను నెదం బోతనయున్.

సీ. ఆ నిశిన్ విధిలేక యాఁగె నొక్కెడఁగాని
తల్లికై మనమందుఁ దల్లడిల్లుఁ
గ్రిందఁ దాఁబడుకొనుఁ గ్రిందవైచిరో యేమొ
నా తల్లినని యెదం గోఁతవడును
కనుమూసికొను నిశ్లె కనుమూసి నా తల్లి
మరణించునో యని మదిఁ దలంచుఁ
దెలవాఱు చెప్పుడన్ని చలిమంటఁ గ్రాఁగుచుఁ
దలి మంటఁబడిన విధమ్ము నెంచు

గీ. వచ్చినప్పుడు కడు చెడ్డ వల్లులయ్యె
తెక్కలం గట్టుకొని వ్రాలు తెక్కరణినిఁ
జనువఱకుఁ బ్రాణముండునో చనునొ కడకుఁ
గండ్లఁ జూచు భాగ్యమ్మెని కలదొ యనుచు.

క. ఒక దెస తన మనమును జనని కలఁత నిడి పుండు సేయ నృపతి తనయెడన్
బ్రకటించిన యవమతి హృచ్ఛకలమ్ముల ఖారములను జల్లుచునుండన్. 391

క. ఖేద మ్మొకయెడఁ గ్రోధోన్మాద మ్మొకప్రక్క రేఁగి మానసమందున్
సూదులు గ్రుచ్చఁగ నొక్కొక పాదమ్మును వైచు చిట్లు భావించుకొనున్.

ఉ. 'సొత్తున కాసఁ జెంది చని క్షుద్రనృపాలురఁ జేరి వారి యు
న్మత్త ప్రలాప గాన మహిమమ్ములు పందిని నందిఁ జేయఁగా
నెత్తినఁ బెట్టికొం చిదియె నిక్కమటంచును బ్రక్క తాళముల్
తొత్తయి తక్కతోమ్మనుచుఁ దొత్తువలె న్లయవేయు టొప్పునే ? 393

ఉ. చిత్తము స్వామి యంచురకఁ జేతులు పూర్వ సువాసినిం బలె
న్వత్తులఁ బేనఁగా విటుని వశ్యునిఁ జేసెడి వేశ్యయట్లు కిం
చిత్తయిన న్మనమ్మునకుఁ జెందని కృత్రిమహాస దీప్తులన్
బత్తెపుఁ బెత్తనమ్ములకు బంగరు హారతిబట్టి కొల్తునే. 394

చ. మునుఁజన నన్ను ఖించి చను ముఖ్యుఁడవా యను నొక్క యడ్గు వె
న్కనిడిన నీవు వట్టికొఱగాని జడుండ వటంచుఁ దిట్టుఁ బ్రి
క్క నడచినంత నాసమముగాఁ జన నర్హుఁడవౌదువే యనుం
గన నెటువోయిన న్భ్రమయె క్ష్మాపతి పల్లెరుకాయ చాడ్పునన్.' 395

వ. అనుచు యీ గతి భావించుకొనుచు. 396

ఉ. ఆమడ కోసుగాఁగ నెట నాఁగక గాలియ తేఁగుఁదెంచి వే
గ్రామము సొచ్చి మార్గమునఁ గాంచినవారినిఁ బల్కరింప నిం
కేమి వినంగనౌనొ యని యింటికి నేరుగ నేఁగ నెప్పట
ట్లామెయు వచ్చి కాళులకునైన జలమ్మిడదాయె భర్తకున్. 397

ఉ. ఏమనకుండఁ గాంచి చని రింత మొగమ్మయి లోని కింటివా
రా మహనీయు మానసమునం దొక గుండువడెన్ గుభాలునన్
శ్రీ మహితాఢ్యమౌ గృహము చీఁకటివడ్డటు చిన్నవోయి యే
బాములొ దాఁపురించినటు బావురుమం చగుపించె నెల్లెడన్. 398

తే. వచ్చినట్టి సోదరుని దిప్పన్న చూచి
మారువల్కక కన్నుల నీరు నించె
నాత్రమున నేమి యెట్లుండెనని యడిగిన
నిన్న నే పోయినది యనెఁ జిన్నవోయి.

ఉ. 'ఆఁ' యనుచున్ వివర్ణవదనాక్షుల నశ్రులు గ్రమ్మఁ 'బోతివ
మ్మా!' యని ఖేద గద్గద మహోత్తరవంబుల నార్వఁ దిప్పరా
జో యసమానధైర్య మెదఁ జొప్పడ సోదరు నాఁపి వల్కె వ
ద్దీయది విన్నఁ బ్రాణములె యేఁగును జైపయి నయ్యగారికిన్. 400

క. అనవుఁడు పోతన యలికిడి
తన చెవిఁ బడఁ గేసరాజు 'తల్లి!' యని నీ
తనయుఁడు వచ్చెను లక్ష్మి!
కనరమ్మని పెద్దకెట్టుగా నేడ్చె సొదన్. 401

తే. గర్జ విన్నంత గుండె వ్రక్కలయిపోయెఁ.
గట్టుతెగిన యేఱగుచు దుఃఖమ్ము పారలె
వెంటనే పోతన మహోర్తి వెడలి తండ్రి
పైనఁ బడి యేడ్చెఁ దిప్పన వశము దప్పె. 402

గీ. తల్లి కొడుకా యనుచు తల్లడిల్లిపోయె
నాకు భుజమిడవచ్చితే నాయన! యని
తండ్రి తలఁబాదుకొనియూర్చెఁ దనయుఁ డేడ్చె
తెలివిఁ దప్పెను కేసన నిలిచె నేడ్పు. 403

గీ. అపు డనుజుఁగాంచి యగ్రజుం డాగుమయ్య,
యెట్టెటో చేయుచుండెఁ దా నట్టె కండ్లఁ
జీఁకటులుగ్రమ్మె మైఁజల్ల చెమటవోసె
ననుట పోతన బెగడి కేసననుగాంచె. 404

ఉ. అంతనె చంటిబిడ్డవలె హా కొడుకా! యని కేసనార్యుఁడున్
జింతిలు పోతనార్యుఁ దొడఁజేర్చి తలన్నుదురంటి బాదుకొం
చంత మెరుంగనట్టి సొద నాగిరగుండియ నాత్మబాసి, దుః
ఖాంతపు నాటకంబొకటి యాడెను తాన ప్రధానపాత్రియై. 405

గీ. ఒక్కపరి ఘొల్లుమనె నిల్లు బిక్క మొగము
తోనిలిచె భాతృయుగళమ్ము దుఃఖజలధి
మంచువలె గడ్డకట్టి స్తంభనము జెందె
నిండ మునిగినఁ జలియింక నుండఁగలదె. 406

గీ. ముందు నేనన నేనె మున్ముందనుచును
బంతమాడుకొన్నట్టులు పయనమైరి
జాపురే యెంత పుణ్యాదంపతులు వీర
లనుచు గుంపులై ప్రజ కొనియాడె వారి. 407

గీ. ఎంతటి యదృష్టవతికి తా నీ విధముగ
వచ్చు నైదువమరణమ్ము వసుధలోన
పోయెఁ బసుపు కుంకుమరాలఁ బూర్ణకళల
లక్కమాంబ యనిరి యూరి లలనలెల్ల. 408

క. కాదిది సమయమ్మనుచును ఖేదము నావలకుఁద్రోసి కించిత్తయినన్
వైదికవిధి దప్పక దహ నాదిక్రియ లాచరించిరా సోదరులున్. 409

గీ. వత్సరములోన గ్రహణపర్వంబు వచ్చి నప్పుడేఁగి గోదావరియందు గల్పి
పితరుల ఋణవిముక్తి గావింపనెంచి వారి యస్థికలన్భద్ర పఱచిరంత. 410

వ. తిప్పనార్యుండు పితరుల వియోగానంతరము కొంత కాలమ్మునకె జనకునకు
కన్యాదాన ఫలప్రాప్తికినై తన పెంపుడు చెలియలి వైవాహిక క్రియా కలా
పంబు లాచరించె నయ్యెడ. 411

## ఆశ్వాసాంతము

క. పావనముని జీవనబుధ సేవన ప్రణతార్తి హరిణ శీలావన సు
గ్రీవారివి బర్హణచణ పావక సమపత్ర ! భావభవ మృదుగాత్రా!

ఉ. వికచనవారుణాబ్జదళ విశ్రుతనేత్రవిశాల ! విస్ఫుర
న్ముకురకపోల ! రాజనిభ మోహనఫాల ! దయాలవాల ! సు
ప్రకటిత మందహాసముఖ భాసురమౌక్తికమాల ! శ్రీహరీ !
యకలుషశీల ! వార్ధిమదహారక మార్గణజాల ! రాఘవా !

### ఫాలాళదళవృత్తము

మదనసుమ విశిఖసమ మధురతమనేత్రా !
కదనతలదనుజఖల గళవిదళపత్రా !
సదయ ! విధుహృదయపృథుజలద మృదుగాత్రా !
త్రిదశనుత పదముని గదిత నిజచరిత్రా !

### గద్యము

శ్రీమద్భరద్వాజగోత్ర పవిత్రాపస్తంబసూత్ర, ప్రథిత సూరిజనమిత్ర,
బక్కయ్యశాస్త్రిపుత్ర వాగీశ్వరీ సమాసాదిత, వైదేహీవర నివేదిత
సరసకవితావిలాస, సహజ పాండిత్యభాస, వరకవివిధేయ,
వరదార్య నామధేయ ప్రణీతంబైన పోతన చరిత్ర
మను మహాప్రబంధమ్మునందు
చతుర్థాశ్వాసము.



శ్రీరస్తు

శ్రీ వాగీశ్వర్యై నమః




## రామ సాక్షాత్కారము - లేఖినీ ప్రదానము

"రామశ్శస్త్ర భృతా మహమ్"

శ్రీరామా! గుణ రూప ల
తా రామా! దైత్య హృత మహాసాధ్వీ సీ
తా రామా విరహానల
నారాచవి తప్తసోమ! నైగమధామా! 1

తే. భవదమూల్య సందర్శన భాగ్యయుతము
భక్తిభావ సంభరితము ప్రాజ్ఞనుతము
కరుణరస కథామృతము సత్కవి చరితము
చిత్తగింపవె రామ ప్రసిద్ధనామ! 2

తే. ఆర్యుఁ డగ్రజాతుండు తిప్పన్న వెంట
రాఁగఁ బోతన సోమోపరాగ వేళ
గంగఁ గ్రుంకి తీర్థ శ్రాద్ధగతుల నెఱపఁ
జనుచు ముందొక గ్రామమున్ గనుచుఁ బల్కె. 2

సీ. "సస్వర వేదఘోషలు శ్రుతిం బడు నిద్ది
చతురాస్యు నాస్థాన సదనమేమొ
షట్ఛాస్త్ర సంవాద చాతురి నొప్పారు
నిది శారదాదేవి వదనమేమొ

హవ నాగ్ని హోత్ర ధూమావృతం బియ్యది
బలి యజ్ఞవాటికా ప్రాంతమేమొ
షడ్రస పక్వాన్న సౌరభావృత మిద్ది
నల భీమ నృపుల పాకసములేమొ

తే. చేతనా చేతనముల నీక్షింప నిచట
శ్రౌతమో స్మార్తమో జ్యోతిషమ్మొ సాంగ
మంత్రపాఠమ్మొ పఠియింప మహితగతిని
గూటమైనట్లు దోఁచు నివ్వీటఁ దాము! 4

ఉ. ఆలయ గోపురోపరి విహారమొనర్చుచు రాజశారికా
జాలము ఋగ్యజుశ్శ్రుతుల సస్వర మాలపనం బొనర్చుటల్
శాలలపై శుకప్రతతి సామము పాడుటయున్ బదాలు వీ
సాలు ద్విజాఖ్య నియ్యెడల సార్థకమున్ బొనరించు నవ్వియున్." 5

చ. అనుటయుఁ దిప్పనార్యుఁడు నిజావరజుం గని పల్కు "నీ పురం
బును దగ మంత్రకూట మనఁ బొల్పెసలారు ద్విజాగ్రహారమై
ఘనతర వేదశాస్త్ర చయ కల్పక మున్వర సాహితీకళా
ధనదుల కాస్పదంబు పఠితమ్మల స్కాంధపురాణ గాథలన్. 6

తే. నవరసము లూరు శ్లోకముల్ నవత మీఱ
షడ్రసాన్విత పాకముల్ చవులు బుట్ట
రచన సేయుటలో సాటిరా రెవార
లనుచు నుతికెక్కి రిచటి బ్రాహ్మణ కులజులు. 7

సీ. వర పశ్చిమ చళుక్య వసుధాధి నేతయౌ
భూలోక మల్లుని యేలుబడిని
ప్రాతినిధ్యమ్మూని పాలించె నివ్వీడు
రాజధానిగ గుండరాజు తొల్లి
యా గుండ నృపుని రాజ్యభ్రష్టుఁ గావించెఁ
గాకతి ప్రోలరా ట్క్ష్మనుఁడు దొడరి
యప్పట్లి రూపతి యడఁగిన యీ ప్రోలు
కాకతివంశ దివాకరుండు

తే. శ్రీ ప్రతాపరుద్రుఁ డమోఘ శీలధనుఁడు
మఱలఁ బొందించి వేదవాఙ్మయ విధాత

శాస్త్రనేత గోపాలకస్వామి యనఁగఁ
బేరు గనిన విప్రున కగ్రహార మిడియె. 8

ఆ. మంత్రకూట వాసి మల్లికార్జున సూరి సకల శాస్త్రవాది సత్యవేది
యాత్మ తత్త్వవేది యాచార్యుఁడయ్యెను వర ప్రతాపరుద్ర ధరణిపతికి.

క. నెట్టన శైలేశ్వరునకుఁ గట్టించెను దేవళమ్ము గణపతిదేవుం
డట్టులె తన కీరితి తోఁబుట్టన శీలాబ్ధి యనఁగఁ బొనరిచె సరసిన్. 10

చ. అని వినుతించుచున్ బుర వరాలయ శోభల నెంతొ వింతగాఁ
గనుచును దిప్పరాజు తమకమ్మునఁ దమ్ముని తోడఁ గూడి వే
జని ఘన గాంగవారి తట సద్మవిభాసితుఁడైన గౌతమీ
శుని గని మ్రొక్కి కాకు కృత సుందర మందిర శోభ లెంచుచున్. 11

చ. తుల చన నేఁగు నెన్నడలఁ దూఁగు హారంగు తుఱంగలింపఁగా
శిలలను ముంచి స్థాణువుల శీర్షమునన్ ధరియించి మించు వే
రలల సృజించి భక్తభవ హారిణిగాఁ జరియించు గౌతమీ
జలమును గాంచి మ్రొక్కి తలఁ జల్లుకొనెన్ గురుభక్తి యొప్పఁగన్. 12

ఉ. గౌతమిఁ గ్రుంకి మాతృపితృ కాయపు టస్థుల గంగఁ గల్పి వే
పైతృక శ్రాద్ధముల్ ప్రథిత పార్వణ పద్ధతి సల్పి భూసుర
వ్రాతము నిష్టభోజ్యరస భక్ష్యపదార్థ పవిత్రపాత్రి వి
స్ఫీతధనాళిఁ దన్పి పితృ శేషములన్ భుజియించి భక్తిమై. 13

క. ఆ సోదరులును భుక్తాయాసముఁ దీర్చికొనఁ జెంత నలరు జలతటీ
భాసురవృక్షచ్ఛాయావాస మ్మొనరిచిరి సందె వడె నయ్యెడలన్. 14

క. మందానిలతతి శీతల
చందన సదృశమయి వీచె సాయం సంధ్యా
వందన కాలమ్మని తట
మందొక యెడఁ గూరుచుండె ననుజుఁడుఁ దానున్. 15

వ. అంతఁ గవివరుండు గౌతమిం గని సంధ్యారాగరంజితంబులగు తత్పరిసరంబుల
సౌందర్యంబుల నిట్లభివర్ణింపం దొడంగె. 16

సీ. సంధ్యాతపాగ్నిలో జాతరూపనగమ్ము కరఁగిపాఱిన యట్టు లరుగు జలము
జలపూరములలోనఁ దలక్రిందుగాఁ దపో విధిబూని బింబించు వృక్షరాజి
వృక్షబింబమ్ములన్ విరిడోల లూఁగెడి యనిలార్భకులతోడ నాడు, పవిత
సవితృబింబమునకు సరసంపుగతి దాఁగురింత నేర్పెడి లహరీ ప్రతతులుఁ

తే. బొదల నుదక నారాయణు సదమలాంత
రంగ మన దివిభువుల కుత్సంగ మనుచుఁ
బైనఁ గల మిన్ను నడుగునఁ బరఁగు మన్నుఁ
గూడ నొకసారి నీలోనఁ జూడఁజేతు 17

శా. గంగా భంగ తరంగ సంగత తటక్ష్మాజమ్ములం దూఁగి పో
త్తుంగానీల కళావిలాసి మహిభృద్దుర్గమ్ములం డాఁగి రం
గుం గొట్టాల వసంతముల్ జిలుకు నర్కుండా నదీ యోషమై
సింగారించిన వెల్లకోక మెఱయన్ స్ప్రీయానురాగాంకమై. 18

సీ. ఇసుకదిబ్బల నడ్డు లేర్పడ గునగున నడచుచు నెడనెడ నడరి దూఁకి
జలములపైఁ దేలి మిలమిల లాడుచు నెగయు మీనుల ముక్కునఁ గఱచికొని
తేపకు నీటిలో దేహమ్ముల ముంచి వచ్చి యీఁకల నెల్ల విచ్చియార్చి
తుంగగుంపుల మధ్య దూరి నెమ్మదిగొని పొదుగుచు నిటునటు పొరలి లేచి

తే. బారులుగ నొక్కపెట్టునఁ బై కెగయుచు
ఱెక్కలాడించు చొకమఱు సక్కసాఁచి
అర్ధవలయాకృతిం బంతు లలరుగతుల
ఖగము ల స్తంభ తోరణాల్ గట్టె దివిని. 19

శా. పాఱున్ బకుల తోరణమ్మిటు నభోభాగాన గోదావరీ
నీరాంతః ప్రతిబింబితమ్మయి, చలన్నీలాబ్ధ శైలోల్లస
ద్వారుణ్యాశ సువర్ణశోభ లపరాంభఃపూర భంగాకృతిన్
దీరం బట్లొరయంగ నెండపొడ నర్తించున్ ద్రుమాగ్రమ్ములన్. 20

తే. తత్ప్రకృతిశోభలకు దృష్టి దగులకుండఁ
గా భరద్వాజమును మీఁదుగాను ద్రిప్పి
వెంటనే నిశాయవనిక వేసి దాచి
జగతి మూరించి చనిరేరొ సాంధ్యకళల. 21

కం. జలయానము డిగి కల మీవలి యొడ్డున నబకజాఁతి బంధించుచుఁ జేఁ
పలబుట్టలు మొల ప్రేలన్ వల మూఁపునఁ గ్రాల బె స్త వసతుల కేఁగెన్. 22

క. అని సంధ్యాశోభలఁ గని భువమున నానందవార్ధి మగ్నుండై తూ
ర్పున నపుడే పొడిచిన చక్కని పార్వణ చంద్రుఁ గాంచి కవి యిటు లెంచున్.

